

**కల్యాణసుందరర్** (13 వ శతాబ్దపు శిల్పం) —చిత్రకారుడు : బాపు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 49
సంచిక 2
**14.9-55**

మన్మథ అధిక భాద్రపద బహుళ త్రయోదశి బుధవారం



కలకత్తాలో ఈమధ్య విడుదల అయిన బెంగాలీ చిత్రం "పథేర్ పాంచాలీ"లో ఒక దృశ్యం. కీ. శే. విభూతిభూషణ బంద్యోపాధ్యాయ రచించిన నవల ఆధారంగా పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ఈచిత్రం నిర్మించింది.

బెంగాలీ గ్రామజీవితంలోని సౌందర్యాన్ని, మాధుర్యాన్ని 'వచనకావ్యం' అనిపించే రమణీయ శైలిలో చిత్రించిన ఈ నవలకు బెంగాలీ సారస్వతంలో అత్యుత్తమస్థానం ఉన్నది. దీని అనువాదం సీరియల్ రూపంలో ఆంధ్ర వారపత్రిక త్వరలో ప్రకటించనున్నది.

ముఖచిత్రం : నేషనల్ ఆర్ట్ థియేటర్ వారి "జయసింహ"లో అంజలీదేవి.

## విషయసూచిక

సీరియల్

# దావాగ్ని

జి.సి. రామకృష్ణ

## 3

ముఖప్రీతి మాటలు మాట్లాడే మనుషులు, నాగుబాముతో సమానులు.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు కామేశ్వరరావుగారు ఎప్పుడూ ముసిముసి నవ్వులు నవ్వుతూనే ఉంటాడు. ఆయన ఆ గ్రామదేవాలయానికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా గవర్నమెంటువారిచే నియమించబడిన ఉద్యోగి. కామేశ్వరరావుగారు గ్రామానికి వచ్చిన తొలిరోజుల్లో ఒక మాసిన చొక్కా, అడ్డకట్టుపంచ ధరించి, బిచ్చగాడిలాగా ఉండేవాడు. కానీ క్రమంగా రోజులు గడిచేకొద్దీ ఆయన వేషభాషల్లో విపరీతమైన మార్పు వచ్చేసింది.

ఇప్పుడు గ్లాస్కో పంచె తప్ప తక్కువ రకం ధోవతులు ఆయన ఏ రోజూ ధరించటం లేదు. సిల్కులాల్చీలు తప్ప చవుకబారుగుడ్డలు చొక్కాలు కుట్టించడం లేదు. కామేశ్వరరావు పంతులుగారు బ్రతుక నేర్చిన మనిషి. ఏ సమయంలో ఎలా మాట్లాడాలో, ఎవరిదగ్గర ఏవిధంగా అభినయిస్తూ మాట్లాడితే సంతోషిస్తారో, ఆయన పరిశోధనా పూర్వకంగా కనిపెట్టి, జాగ్రత్తగా మెలుగుతూ ఉండేవాడు. ప్రధాన ధర్మకర్త (ఛీఫ్ ట్రస్టీ)గారిదగ్గర, కామేశ్వరరావుగారు మాట్లాడేవిధం వేరు, మిగిలిన ట్రస్టీల దగ్గర మాట్లాడేవిధం వేరు.

ప్రధాన ధర్మకర్తగారైన రామిరెడ్డిగారు దేవుని సొత్తు దిగమింగుతున్న విషయం ట్రస్టీలందరికీ తెలిసిన విషయమే. అందువల్ల కామేశ్వరరావుగారు, ట్రస్టీలదగ్గర రామిరెడ్డిగార్ని నిందిస్తూ మాట్లాడేవాడు. రామిరెడ్డిగారిదగ్గర యితర ట్రస్టీలపై చాడీలు చెప్పేవాడు. అందువల్ల రామిరెడ్డిగారికీ మిగిలిన ట్రస్టీలకు మధ్య క్రమంగా మనస్పర్థలు ఎక్కువైనాయి.

నోరులేని అమాయకు డెవడైనా ఉంటే వాడి సొత్తు దిగమింగడానికి అందరూ సిద్ధపడతారు. దేవాలయంలోని దేవుడికి నోరు లేదు. తన ఆస్తిపై వచ్చే ఆదాయాన్ని ట్రస్టీలు, ఆఫీసర్లు, పూజార్లు హరిస్తున్నా, పాపం దేవుడు, వారికి ఒక్కరోజైనా కలలో కనబడి బెదిరించనైనా బెదిరించడు. అంత మంచివాడు దేవుడు. లోకంలో మంచితనానికి ఉన్న చోటు చాలా తక్కువ. అందువల్ల దేవునిమంచితనాన్ని ఆధారంగా చేసుకొని దేవుని సొత్తు కాజేయడానికి అందరూ ముందంజ వేస్తుండేవారు.

"రామిరెడ్డిగారొక్కరే దేవుని సొత్తు ఎందుకు తినాలి? మేముగూడా ట్రస్టీలమే గదా, మాకుగూడా దేవుని సొత్తు తినడానికి అధికారం లేదా?" అని మిగిలిన నలుగురు ట్రస్టీలు తలపోస్తూండేవారు.

కామేశ్వరరావుగారు అసాధ్యులు. ఆయన అందరిదగ్గరా చాకచక్యంతో నటిస్తూ, ఉద్యోగానికి వచ్చిన అయిదారు సంవత్సరాల్లోనే పదివేల రూపాయలు భార్య పేరున బ్యాంకులో వేశాడు. కామేశ్వరరావుగారి భార్య సుందరమ్మ, చాలా అమాయకురాలు. పదివేల రూపాయలపై తనకు అధికారం లభించిందని తెలిసిన స్త్రీ ఎంత ఆనందం అనుభవిస్తుందో వర్ణించడానికి మాటలు చాల్తాయా!

సుందరమ్మ మెల్లగా మాధవశాస్త్రిగారి భార్యదగ్గరికి వచ్చి, ఆమాటా ఈమాటా, మాట్లాడి, పదివేల రూపాయలు తన పేరుమీద బ్యాంకులో ఉన్నాయని చెప్పి, "విమలమ్మా, నీతో కాబట్టి చెప్పాను. ఇంకెవరితో చెప్పవు కదూ?" అని ఒట్టు వేయించుకొని వెళ్ళింది

విమలమ్మ సుందరమ్మకు స్నేహితురాలే! సుందరమ్మకన్నా పదిరెట్లు అమాయకురాలు విమలమ్మ. ఆమె గుట్టుగా మాధవశాస్త్రిగారి చెవిలో చెప్పి, "ఏమండీ, ఎవ్వరితో చెప్పొద్దని సుందరమ్మ బ్రతిమాలింది" అని చెప్పింది.

కామేశ్వరరావుగారు పదివేల రూపాయలు భార్య పేరున బ్యాంకులో వేశాడని, మాధవశాస్త్రిగారికి తెలిసినప్పుడు, ఆయన ఏమీ ఆశ్చర్యపడలేదు. ఆ గ్రామంలోని పెద్ద భూస్వాములందరూ, తమ ఆస్తులు భార్యల పేరులలోనే వేసిఉన్న సంగతి మాధవశాస్త్రిగారికి బాగా తెలుసు— చిన్నతనంనుండీ మాధవశాస్త్రి దైవభక్తి పూరితమైన వాతావరణంలోనే పెరిగాడు. మాధవశాస్త్రి తండ్రిగారైన కృష్ణశాస్త్రి

# ★ దావాగ్ని ★

గారు ప్రతిరోజూ భూస్వాముల ఇంళ్లకు వెళ్లి తిథి వార నక్షత్రాదులు చెప్పి వస్తుండేవాడు. తండ్రితో కూడా మాధవ శాస్త్రి పంచి పట్టుకొనిపోతుండేవాడు. గ్రామస్థులు బియ్యము, కూరగాయలు ఇచ్చే వారు. ఎలాగో కాలక్షేపంచేసి, తల్లి దండ్రులు స్వర్గస్థులయ్యారు. తండ్రి మరణ శయ్యపై ఉండి, మాధవశాస్త్రిని దగ్గరికి పిల్చి, తల నిమిరి, నాలుగు హిత వాక్యాలు చెప్పాడు. ఆ వాక్యాలు ఎప్పుడూ మాధవశాస్త్రి హృదయంలో ప్రతిధ్వనిస్తూ ఉండేవి. "నాయనా, ఈ గ్రామస్థులమధ్య ఎట్లా బ్రతుకుతావో! ఎవరైనా నిన్ను ఒక మాటన్నా, గుట్టుగా తలవంచుకొని వెళ్ళిపోతూ ఉండు. ఫలానివాడు తప్పు చేస్తున్నాడు అని నీకు తెలిసినా, అసంగతి నీవెవ్వరితో చెప్పవద్దు. ధనమదంతో కళ్లు గానక ఉండేమనుషులతో, చాలా జాగ్రత్తగా మెలగాలి. నిజం నీకు తెలిసినా నీవెవ్వరితో చెప్పవద్దు" అని తండ్రి తన ఎదుట నిల్చొని వాత్సల్యంతో చెప్పుతున్నట్లే ఉండేది.

రామిరెడ్డిగారి దగ్గర గుమాస్తాగా చేరిన తర్వాత మాధవశాస్త్రిగారు తన కళ్ళతో నే ఎన్నో అన్యాయాల్ని చూచాడు. ఏదైనా అన్యాయం జరిగినపుడు "ఇది అన్యాయం" అని మాధవశాస్త్రి నిర్భయంగా చెప్పే వాడుకాదు. తన తండ్రి చెప్పిపోయిన హితవాక్యాలు జ్ఞాపకానికొచ్చేవి. మాధవ శాస్త్రిగారి మనసు మృదువైనది కావడం వల్ల, ఒక్కొక్కసారి పొరపాటున ముందంజ వేసి లేనిపోని కని తన తలకు చుట్టుకొనే వాడు.

పండుగ నెల ప్రారంభమయినరోజు దేవాల యంలో పూజారితో ఘర్షణ పడవలసి వచ్చింది. పూజారి గెరటయ్యను లెక్క చేయక పోవడం, అందరికి ప్రసాదం పెట్టే టప్పుడు అతనిని, నిర్లక్ష్యంగా చూడడం, ఒంటిమీద గుడ్డలేక బానపొట్టతో ప్రాణాలు బిగపట్టుకొని, ఆశతో చేతులు పైకెత్తి "స్వామీ, స్వామీ, నాకు పెట్టలేదు" అని దీనంగా, ప్రసాదం అడుగుతున్న పసిబాలుణ్ణి పూజారికొట్టడం, మొదలైన సంఘటనలన్నీ మాధవశాస్త్రికి జాలికలిగించి, విపరీతమైన ఆవేశాన్ని కలిగించాయి. ఆవేశాన్ని అదుపులో పెట్టుకోలేక, ప్రసాదం పళ్లెం పూజారి చేతుల్లోనుండి లాక్కొని మాధవ శాస్త్రి తన యిష్టంవచ్చినట్లు పంచిపెట్టాడు.

ఆనాడు జరిగిన సంఘటనలను పూజారి వీరభద్రయ్య మరిచిపోలేదు. తనను అందరి ముందూ అవమానించిన మాధవశాస్త్రిపై ఎలాగైనా పగదీర్చుకోవాలని, పూజారి త్రాచుపాములాగా పగబట్టి అదును చూస్తున్నాడు—

ఒకరోజు రాత్రి పదగిగంటలయి ఉంటుంది. వీధిలో రచ్చటరుగుమీద, ఇద్దరు మనుషులు కూర్చొని గుసగుసలాడుతున్నారు. ఆ యిద్దరు వ్యక్తుల్లో ఒకడు పూజారి వీర భద్రయ్యగారు రెండో వ్యక్తి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు కామేశ్వరరావుగారు.

"వీధిలో విలబెట్టి వేలం వేస్తే, చిన్న డబ్బు చెయ్యని వెధవ, వాడు నా చేతులో పళ్లెం పెరుక్కొని, ప్రసాదం పంచి పెట్టాడే! పంతులుగారూ నిజమనుకోండి, అబద్ధమనుకోండి వృథాగా గలభా అవుతుం దని ఊరుకున్నానుగానీ కావాలనుకుంటే వాణ్ణి నల్లిని నలిపినట్లు నలిపెయ్యనటండీ."

"అసలు వాడికేం అధికారముంది భద్రయ్యా? వాడు ధర్మకర్తగారి యింట్లో గుమాస్తా. అసలు వాడికి దేవాలయంలో అడుగుపెట్టడానికే అధికారం లేదు. ప్రసాదం పంచిపెట్టే అధికారం పూజారిది. అంతే గాని, వాడెవడు ప్రసాదం పంచడానికి? నేను సమయానికి అక్కడ లేనుగానీ, ఉంటే ఖచ్చితంగా నిలదీసి అడిగుండేవాణ్ణి. నీవు గాబట్టి పళ్లెం చేతులోనుండి పెరుక్కుంటే చూస్తూ నిల్చున్నావు."

"రేపు, రెడ్డిగారు పెల్లూర్నుండిరాగానే చెప్తా మనుకుంటున్నాను సార్. మీరే మంటారు?"

"ఏమిటి భద్రయ్యా! నీవు చెప్తావంటే నే వద్దంటానా? వాణ్ణి ఎలాగైనా కొంచెం అదుపులో పెట్టాలి. లేకపోతే మన కిందకే నీళ్ళు తెచ్చేట్టున్నాడు. ఏమీ లేదు భద్రయ్యా, రెడ్డిగారి భార్య సావిత్రమ్మ దయవల్ల బతుకుతున్నాడు, బడుద్దాయి. అంతకంటే ఇంకేమీ లేదు. నీకు తెల్సునో తెలీదో!"

"ఏమిటీ!" అని ఆశ్చర్యంగా మణుగు నాలుక వెళ్ళబెట్టాడు పూజారి.

"నీకింకా తెలీదా?"

"లేదండీ, నాకేం తెలుసూ?"

"హయ్యో, పిచ్చివాడా; ఎంత అమాయకుడివయ్యా భద్రయ్యా! వూళ్లో అందరికీ తెలిసినా నీకు తెలీదన్నమాట."

"లేదండీ ఏమిటో చెప్పండి సార్"

"ఇంకా అర్థం కాలేదా?...అరరే! వీం పిచ్చివాడివయ్యా, భద్రయ్యా...మాధవ శాస్త్రిగారు సావిత్రమ్మగారి పాదంపట్టారు"

వీరభద్రయ్య నిశ్చేష్టుడై, రాతి బొమ్మలా కూచున్నాడు. కామేశ్వరరావు ఆట్టే పైకి వినబడకుండా నవ్వి, "భద్రయ్యా...నే నన్నానని, ఎవరితో అన బోకు. మనసులో వేసుకోనుంటే మంచిది. ఎవ రెట్లాంటివాళ్లో తెలుసుకోడంలో తప్పేముంది? అసలు...నేను ఈ వూరొచ్చిన కొత్తల్లోనే కనిపెట్టేశాను. నా సంగతి నీకు తెల్సుగా, అవులిస్తే పేగులు లెక్కపెట్టేవాణ్ణి. సావిత్రమ్మ మాధవ శాస్త్రితో మాట్లాడేతీరు బాగా గమనించు కావాలంటే, ఏమి వికవికలు ఏమి పకపకలు? ఎట్లాయితే ఏం? మాధవశాస్త్రిగారు అదృష్ట వంతుడు..." అన్నాడు కామేశ్వరరావు.

ఏదో బ్రహ్మాండమైన సత్యాన్ని తెలుసు కొన్నట్లుగా పూజారి సంతోషపడి, కొన్ని క్షణాలు అర్థంకాని ఆనందంతో పరవశ మయి, "నిజమేనండీ సార్...నిజమే. మీరు చెప్పింది అక్షరాలా నిజం. మొన్న ...నేను, ప్రసాదానికి బియ్యము డబ్బు అడిగి తీసుకుందామని వెళ్లాను. ఆ వ్యవహారం చూస్తుంటే ఇంట్లో సర్వాధికారం

మాధవయ్యకే ఉన్నట్లుంది. సిగ్గూ బిడియం లేకుండా పకపక నవ్వుతూ, "దేవుడు కుంచెడు బియ్యపు పులుసన్నం తింటాడా?' అని అడిగిందండీ; ఆవిడ ధైర్యం ఏమని చెప్పేది?... నేను చెప్పుతో కొట్టినట్లు సమాధానం చెప్పాలెండి! ... నిజమేనండి పంతులుగారూ, మీరు చెప్పినమాట అక్షరాలా నిజం... లేకపోతే, మాధవయ్యకు అంత ధైర్యం వస్తుందా?...అమ్మగారి అదుపు చూచుకొనే ధైర్యంగా నన్ను దేవాలయంలో 'కుంచెడు బియ్యపు, పులుసన్నం ఇదేనా?' అని అడిగాడు - లేకపోతే,... వాడి బాబు పురాణం చెప్పుకొని బతుకుతుండేవాడు. వీడు చిన్నతనంలో, సంచి చేతబట్టుకొని ఇంటింటికి ముష్టికి పోతుండేవాడు...నన్ను... అదిరించి బెదిరించేంతటివాడా వీడు! పంతులుగారూ.... నూదివలె వచ్చి దబ్బనంలాగా తేలాడని అంటారు......వీడికి ధర్మకర్త గారింట్లో గుమాస్తా పని యిప్పించింది నే నేగదటండీ! పాపం ఆ మహాపండితుడు కృష్ణశాస్త్రిగారు బ్రతిమాలుకుంటేనూ, నేనే రెడ్డిగారితో చెప్పి ఏదో దిక్కులేనివాడు అని సహాయం చేస్తే, వాడు నన్నే ఎదిరించాడే! ఔరా! ఏం కాలమండీ!"

"అంతే కదటయ్యా భద్రయ్యా! ఈ కాలంలో మంచిచేసేవాడికి చెడు ఎదురవుతూనే వుంటుంది"

కొన్ని క్షణాలు ఆ వ్యక్తులిద్దరు గుసగుసలాడి చెరొకవైపుకీ నడిచి అంధకారంలో కలిసిపోయారు.

## 4

చందమామ కొత్త పెళ్ళికొడుకులాగా కళకళలాడుతూ నక్షత్రాలతో సరసాలాడుతున్నాడు. మంచుగాలి లోకానికి చక్కిలిగింతలు పెడుతూఉంది—

అది మాధవశాస్త్రిగారి కుటీరం. శాస్త్రిగారు భోజనం ముగించి భగవద్గీత ముందు పెట్టుకొని చదువుతున్నారు. దీపం చాలా చిన్నది కావడంచేత మాధవశాస్త్రి తల కిందికి వంచి ఏకాగ్రతతో సర్వస్వాన్ని భగవంతునికే సమర్పించిన మహాభక్తునివలె మాధవశాస్త్రి భగవద్గీత చదువుతున్నాడు.

భార్య విమలమ్మ రెండు వక్కచూర పలుకులు తీసుకొచ్చి మెల్లగా భర్త పెదవులకు అందించింది. మృదువైన ఆమె చేతి వ్రేళ్ళు ఆయన పెదవులకు తగిలి చక్కిలిగింతలు పెట్టాయి. తనముందు భగవద్గీత ఉన్న సంగతి మరిచిపోయి మాధవయ్య విమలమ్మ చుబుకాన్ని మునివ్రేళ్ళతో స్పృశించాడు.

ఆమె కిలకిలా నవ్వి వెనక్కు జరిగి "అమ్మో! భగవద్గీత చదువుతూ....భగవద్గీత కన్నా భార్యే ఎక్కువన్నమాట మీకు?" అంది.

మాధవశాస్త్రి కొంచెంసేపు తికమక పడ్డాడు. భర్తను ఎగతాళిచేసి ఏడిపించుకొని తినడం, విమలమ్మకు ముచ్చట.

"ఏది ఎక్కువో చెప్పండి - మీకు భగవద్గీత ఎక్కువా? లేకపోతే భార్య ఎక్కువా?" అని మొండికేసి అడిగింది.

మాధవశాస్త్రి కొంచెంసేపు ఆలోచించి "భార్యే ఎక్కువ" అన్నాడు.

"అమ్మో! తప్పు, తప్పు" అంది విమలమ్మ.

"ఏం తప్పు?" అన్నాడు మాధవయ్య.

"మీరు చెప్పింది."

"ఎందుకని?"

"భగవద్గీత ముందుపెట్టుకొని, భగవద్గీత కన్నా, భార్యే ఎక్కువని చెపితే, దేవుడికి కోపం రాదూ?" అని విమలమ్మ తమలపాకులు అతని నోటి కందించింది.

"దేవుడికి కోపంవస్తే నాకేం? దేవుడు నాముందు ప్రత్యక్షమై, నీకు నీ భార్యమీద ప్రేమ ఎక్కువా? లేక నామీద భక్తి ఎక్కువా?" అని అడిగినాసరే, నేను ఖచ్చితంగా చెప్తాను."

"ఏమని."

"నా భార్యే నాకు ఎక్కువని."

"ఎందువల్ల?" అని కిలకిల నవ్వింది విమలమ్మ.

"నాకీ ప్రపంచంలో, ఇంకెవరున్నారు? నన్ను ప్రేమతో చూచే తలిదండ్రులు ఎప్పుడో వెళ్ళిపోయారు. ఇంక నువ్వేకదా నాకు?"

విమలమ్మ కళ్లు కృతజ్ఞతతో మెరిసి చెమ్మగిల్లేయి. ఇంతలోనే అదిరిపడింది. "ఏడుపు!......ఎవరో ఏడుస్తున్నారండీ" అన్నది.

మాధవయ్య భగవద్గీత మూసేసి, రివ్వున వెళ్ళి తలుపు తీసుకొని వాకిటిలోకి వచ్చాడు. విమలమ్మ గడగడ వణుకుతూ భర్తను అడ్డగించింది. "వద్దండీ, మీరు పోవద్దు, నాకు భయం. ఇంట్లో నేనొక్కదాన్ని ఉండలేను"

మాధవశాస్త్రి వీధివైపు చూస్తూ కొంతసేపు నిశ్చేష్టుడై నిల్చున్నాడు. చల్లని వెన్నెల......రివ్వున చలిగాలి. ఆ గాలి ఎక్కడనుండో ఒక స్త్రీ ఏడుపును మోసుకొనివస్తూఉంది.

భార్యాభర్తలు ఇద్దరూ నిల్చొని ఏడుపు ఏ దిక్కునుండి వినవస్తున్నదో ఆలకించారు. మాధవయ్య తటాలున భార్యచేతులు విడిపించుకొని, ఆమె ఎంత పిలుస్తున్నా వినిపించుకోకుండా దేవాలయంవైపు పరుగెత్తాడు. విమలమ్మ గడగడలాడుతూ కొంతసేపు నిల్చొని భయపడి పక్కయింటివాళ్ళను నిద్ర లేపింది. పక్కయింటి ఇల్లాలు, విమలమ్మ ఇద్దరూ మాట్లాడుతూ నిల్చున్నారు. -

మాధవశాస్త్రి రివ్వున పూజారి వీరభద్రయ్యగారి యింటివైపు వెళ్లాడు.

వీరభద్రయ్యగారి భార్య పందిరి స్తంభానికి ఆనుకొని పెద్దగా ఏడుస్తూంది. పక్కింటి ఇల్లాలు ఆమెను ఓదారుస్తూ ఉంది. మాధవశాస్త్రిని చూడగానే పక్కింటి యిల్లాలు కొంచెం ధైర్యం తెచ్చుకొని,

"చూడు మాధవయ్యా, దినానా ఇదే గోల; మేము చూడలేక కళ్ళు పోతున్నాయి. ఈ పిచ్చితల్లి ఊరికే ఉండేది కాదు. ఏదో ఒకటి అంటది. ఆయన చావగొట్టేస్తాడు." అంది.

మాధవశాస్త్రి ఆవేశపూరితమైన కంఠాన్ని కొంత అదుపులో పెట్టుకొని,

"ఏమిటమ్మా కమలమ్మా! ఎందుకొచ్చింది జగడం?" అన్నాడు.

"ఏం చెప్పేది నాయనా...నా ఖర్మ... నా రాత... చూడు ... ఎట్లా కొట్టేడో చూడు." అని పూజారిగారి భార్య కమలమ్మ ముఖంమీది గాయం చూపించింది. గాయంలోనుండి రక్తం బొట్లు బొట్లుగా జారుతోంది. ఆమె పమిట చెరగుతో రక్తం అద్దుకుంటూ కన్నీళ్లు తుడుచుకుంటూ,

"ఏమీ లేదు నాయనా....వక్కగింజలో

 దావాగ్ని 

బియ్యపు గింజ. మా యింట్లో ఒక రాణి ఉన్నాదిలే; మీ కందరికీ తెలిసిన సంగతేగా! ఆ రాణిగారికి సాయంత్రం కాఫీ యివ్వలేను. ప్రతిరోజూ యిస్తూనే ఉంటే దాన్ని; ఈరోజు బుద్ధి తక్కువై చక్కెర కొద్దిగా ఉంటేనూ ఆయనకు మాత్రమే పెట్టిచ్చాను. అందుకోసం వచ్చింది నాయనా...'చక్కెర లేకపోతే నాతో ఎందుకు చెప్పలేదు?...నేను తెచ్చిఉండే వాణ్ణిగదా?...దానికి కాఫీ ఎందు కివ్వ లేదూ?' అని...ఇదీ వ్యవహారం. ఎందుకు నాయనా చెప్పుకుంటే సిగ్గుచేటు. నలుగురూ నవ్విపోతారు......నా ఖర్మ నాయనా..." అని కొంగువలుకబైట కన్నీళ్లు పమిట చెరగుతో అద్దుకొంది.

మాధవశాస్త్రిగారు తలుపు తట్టారు... ఎవ్వరూ పలక లేదు.

"భద్రయ్యా,...భద్రయ్యా, తలుపు తీ" అన్నాడు మాధవయ్య.

పూజారి తలుపు తీసి వాకిట్లో నిల్చున్నాడు. సుబ్బి తలాలున తలుపుచాటున దాక్కుంది. వీరభద్రయ్య మహావీరుడిలాగా నిల్చున్నాడు. దీపం వెల్తురులో ఆయన

#  దావాగ్ని 

కలిగింది. మహానందిలాగా ఉన్న తన భర్త పొట్ట తడవుతూ మాధవశాస్త్రిని గలగల తిట్టడం ప్రారంభించింది!

"నా మొగుడు, నన్ను కొడితే, వీడి కేమమ్మా! నా మొగుడు నన్ను కొడితే కొడతాడు, చంపితే చంపుతాడు, మధ్య వీడి కెందుకూ అంట? అమ్మో! ఎగిరి పొట్టమీద తన్నేడే పాపిష్ఠివాడు!"

గ్రామస్థులు మాధవశాస్త్రినే మందలించారు. "వాళ్ళ మొగుడూ, పెళ్లాం, ఎట్టన్నా తన్నుకొని చస్తారు. మధ్య నీ కెందుకయ్యా?" అన్నారు.

మాధవశాస్త్రి అవమానంతో కృంగిపోయాడు. గుంపులోనుండి వెంకటేశ్వర్లు మాధవయ్య దగ్గరికొచ్చి "ఏంది మాధవయ్యా? ఏం జరిగింది?" అని ఆదరంతో అడిగాడు. వెంకటేశ్వర్లు గ్రామ మున్సబుగారింట్లో పేద్యగాడు. మాధవశాస్త్రికి బాల్యస్నేహితుడు. వెంకటేశ్వర్లును చూడంగానే మాధవశాస్త్రికి కొంచెం ధైర్యం వచ్చింది.

"ఏమీ లేదు ఎంకన్నా, నే నిప్పుడే భోంచేసి అట్టా కూచున్నాను. ఎవరో ఏడుస్తున్నట్లు వినిపించింది...గబగబా పరుగెత్తుకుంటూ వస్తే,...కమలమ్మ స్తంభానికి ఆనుకొని ఏడుస్తూ ఉంది. రామమ్మ పక్కన్నే ఉంది - నామాట అబద్ధమయితే అడుగు...ఎందుకమ్మా ఏడుస్తున్నావూ అంటే,..'అయ్యా, ఈరోజు సాయంత్రం, సుబ్బికి కాఫీ యియ్యలేదు, అందుకని తలకాయ పగలగొట్టేడయ్యా' అని కమలమ్మ తలమీద గాయం చూపించింది...నేను పూరుకుండలేక వీరభద్రయ్యను లేపి, 'ఏంది భద్రయ్యా,...ఆమెను తలకాయ పగలగొట్టడం న్యాయమేనా', అన్నాను. నా మాట అబద్ధమయితే, రామమ్మ నడుగు-నే నొక్కమాట ఎక్కువన్నానేమో... 'నీ కెందుకోయ్, నా భార్యను చంపుతాను, ముక్కలు ముక్కలుగా నరుకుతాను, నీ కెందుకోయ్. నువ్వు బలే పెద్దమనిషివి లేవోయ్...' ఈ తరహాగా మాట్లాడాడు.. నువ్వే చెప్పు...తప్పు నాలో ఉంటే, నీ కాలిచెప్పు తీసుకొని కొట్టు నే నొప్పుకుంటాను" అన్నాడు మాధవయ్య.

వెంకటేశ్వర్లు మాధవయ్య చెప్పే మాటలు నెమ్మదిగా విని తుండుగుడ్డ తలకు చుట్టుకొని "నేను దినానా చూస్తానే ఉండాను మాధవయ్యా, ఈ అయ్యోరి నాటకం. మనందరికీ తెలిసిందే కదూ! గుజ్జుకట్టి దీసుకొని ఒక్కరోజు నూకుదామనుకున్నాను. మళ్ళీ ఎందుకులే పెద్దముండాకొడుకు, అని నా దారిన నేను పోతుండేవాణ్ణి." అని... వెంకటేశ్వర్లు వీరభద్రయ్యదగ్గరి కెళ్ళి, "ఏంది స్వామే! నీ పెళ్ళాన్ని దంపేసి, ముక్కలు ముక్కలుగా నరికేస్తే, సంకెళ్లేసి జైల్లో యేస్తారని తెలవదా నీకు? మాధవయ్య ఏదో మంచిమాట చెప్పాస్తే అట్టనేనా మాట్లాడేది! బలేవాడివి స్వామీ!" అన్నాడు.

వీరభద్రయ్య ఏమీ తొణకకుండా "ఓరి పొంగ్రా! మీ రేమిట్రా నాకు సలహా చెప్పేది? నువ్వుగూడా తీర్పు చెప్పడానికొచ్చేవా?" అన్నాడు.

వెంకటేశ్వర్లు చేతికఱ్ఱ చూపించి, "అయ్యోరో! చూసు, బాగా చూడు. నేను మాధవయ్య ననుకుంటున్నావేమో, అందర్ని అదిలించినట్లు నన్ను అదిలించినావంటే, బుఱ్ఱ రామకీర్తన పాడద్ది!" అని గుర్రురిమి అన్నాడు. వీరభద్రయ్య నోరెత్తలేదు. సుబ్బి గోడవెనుక దాక్కొని గడగడలాడుతూ నిల్చొనుంది. వెంకటేశ్వర్లు సుబ్బిని, చూచి "ఏదమ్మా, సుబ్బమ్మా, బంగారు తల్లి! ఒక్కపూట కాఫీ లేకపోతే తమరికి లోటొచ్చిందా? నీవల్ల మే మందరం, చెప్పదెబ్బలు దినాల్సొస్తా ఉంటే, మీ అయ్యగారి చేతులో! మహాతల్లి! 'బలేదానివే సుబ్బి" అని వెంకటేశ్వర్లు పకపక నవ్వేడు.

వీరభద్రయ్య నోరెత్తలేదు. మాధవశాస్త్రి అవమానంతో పశ్చాత్తాపంతో క్రుంగిపోతూ, "పోదాంరా వెంకన్నా"అన్నాడు.

తమాషా చూడవచ్చిన ఆడవాళ్ళూ మగవాళ్ళూ, కిలకిలా నవ్వుకుంటూ ఇళ్ళకు వెళ్ళారు.

వెంకటేశ్వర్లూ, మాధవయ్యా ఇంటికొచ్చారు. మాధవయ్యను చూడగానే విమలమ్మ గొల్లున ఏడుస్తూ "నేను పోవద్దయ్యా అంటే, ఏమన్నా విన్నావా? వృధాగా పోయి, ఎందుకు వాడిచేతులో తన్నులు తిని రావడం? అందరూ ఏమంటున్నారో చూడండి. వాళ్ళ మొగుడూ పెళ్లాం తగూలాడుకుంటారు, తన్నుకుంటారు, మధ్య ఈయనకెందుకు అంటున్నారు." అంటూ విమలమ్మ కన్నీళ్లు తుడుచుకొంది.

వెంకటేశ్వర్లు తలగుడ్డ, ఒకసారి విప్పి చుట్టుకొని, బనీను జోబీలోఉన్న బీడీ, దీపంమీద ముట్టించుకొని, "ఏందమ్మా, వెర్రిపిచ్చిదానిలాగా ఉండావు. ఇప్పుడేం మునిగిపోయింది? ఎందుకు నువ్వు కళ్లనీళ్లు పెట్టుకోడం? మంచిగా చెపదామని పోయ్యాడు. వాడు యిన్లేదు. ఒక్కొక్కసారి వస్తాయ్. మనం ఏంచేస్తాం. మరేమీ మునిగిపోలేదులే, ఊరుకుండు" అన్నాడు.

మాధవశాస్త్రి చిరునవ్వు నవ్వాడు."అది కాదులే వెంకటేశ్వర్లూ, వాడికి నామీద గొంతుకదాకా కోపం ఉంది. మొన్న దేవాలయంలో జరిగిన సంగతి తెలుసుగా నీకు?" అన్నాడు.

"నా కెందుకు తెలవదూ? ఎవరో అంటుంటే యిన్నాలే. నువ్వు బలేపని జేసినావులే మాదవయ్యా...అయినా ఆ దేముడికి బుద్ధి లేదు మాదవయ్యా. ఈరబద్రయ్య చేసే పోకిరిపనులన్నీ, దేముడికి తెలవకుండా ఉంటాయా మాదవయ్యా! నాకు తెలవక అడగతున్నా గానీ, దేముడు మనం చేసే పనులన్నీ చూస్తాఉంటాడు, అని మొన్న భాగవతులు హరికథలో కూడా చెప్పినాడే! దేముడి పూజారి బద్రయ్య చేసే తుంటరితనం దేముడికి తెలవకుండా ఉంటదా! తెలిస్తే దేముడు ఏదో ఒకటి తగినట్లు చేసి, బద్రయ్యకు బుద్ధి చెప్పాల్నా లేదా?" అన్నాడు వెంకటేశ్వర్లు.

అసలు 'దేవుడనేవాడు ఉన్నాడా, లేడా' అని మాధవశాస్త్రి ఎన్నాళ్ళనుండో ఆలోచిస్తానే ఉన్నాడు. భగవద్గీత చదివితే, తన సందేహాలు తీరతాయేమోనని గీతాపారాయణం ప్రారంభించాడు. అందువల్ల మాధవశాస్త్రి వెంకటేశ్వర్లుకు ఏమీ జవాబు చెప్పలేక మౌనంగా కూచున్నాడు.

వెంకటేశ్వర్లు చదువుకొన్నది మూడవ తరగతివరకే అయినా, అతని ఆలోచనాశక్తి చాలా గొప్పది. గ్రామంలో జరిగే సంగతులన్నీ వెంకటేశ్వర్లుకు క్షణంలో తెలిసేవి. పూర్తిగా తెలియకపోయినా తెలిసినట్లే నటిస్తూ చెప్పేవాడు వెంకటేశ్వర్లు. వెంకటేశ్వర్లు బీడీ పొగ గుప్పున వదుల్తూ, "మాధవయ్యా, యింక పండగ ఎన్నాళ్లుందదీ?" అన్నాడు.

మాధవశాస్త్రి తన ఆలోచనలు ఆపి, "పదిరోజులే గదటోయ్" అన్నాడు.

"ఓస్, యింతేనా?" అని, వెంకటేశ్వర్లు విమలమ్మవైపు చూచాడు; విమలమ్మ పడకమీద కూచొని దీపంవైపే చూస్తూ ఆలోచిస్తూఉంది. వెంకటేశ్వర్లు కొంచెం సేపు ఏదో ఆలోచిస్తూ, బీడీ పూర్తిచేసి,

"మాధవయ్యా, పొద్దుపోయింది గానీ, యింక పండుకోండి." అని వెళ్లాడు.

మాధవశాస్త్రి భారమైన హృదయంతో పడకమీద మేను వాల్చాడు. మంచికిపోతే చెడు ఎదురైందన్నట్లు, ఒక దుర్మార్గుడు, వ్యభిచారి, భార్యను చావగొడ్తుంటే వెళ్ళి ఏదో మంచిమాటలు చెప్దామనుకుంటే, అవమానంతో, తిరిగిరావలసి వచ్చిందే" అని మాధవశాస్త్రి ఆలోచిస్తూ పడుకున్నాడు. తండ్రి చెప్పిపోయిన హితవాక్యాలు మళ్ళీ ఒక్కసారి జ్ఞాపకానికొచ్చాయి. భర్తను ఓదారుస్తూ విమలమ్మ అంతలోనే కలకదేరి చల్లగా నిద్రపోయింది.

[ఇంకా వుంది]

# కాకీ, కథకుడూ

అతను పూర్తిగా మారిపోయాడు. గళ్ళ చొక్కా పోయి కల్లీ లాల్చీ వచ్చింది. పేంటు స్థానాన్ని పైజామా ఆక్రమించింది. నున్నగా అణగినణగివుండే జుట్టు ఒక్క దెబ్బకు ఉబ్బెత్తుగా దుబ్బులా లేచిపోయింది. అతను కథలు రాస్తున్నాడు...

కనీ వినీ ఎరుగని విషయాల గురించిగాని, కంచుకాగడా పెట్టి వెతికినా జీవితంలో కనబడని సంఘటనలను గురించిగాని కథలల్లడం అతనికి బొత్తిగా యిష్టంలేదు. ఎక్కడో ఎరువు తెచ్చుకున్న భావాలను సొంతానికి సరఫరా చేసుకోడం సుతరామూ సహించలేడు. అందుచేత అతడు జీవితాన్ని యథాతథంగా చిత్రించడమే తన లక్ష్యంగా, ఆశయంగా పెట్టుకున్నాడు.

కథావస్తువుకోసం అంతగా ఆందోళన పడవలసిన అగత్యంకూడ అతనికి లేదు. తన అనుభవాన్నే ఆధారం చేసుకొని జీవితానికి ప్రతిబింబాలను రూపొందించాలని 'అతని సంకల్పం. కావలసిన వాతావరణం, సన్నివేశాలు, సంఘటనలు కష్టపడి అతుకోక్కనక్కరలేకుండా క్రమబద్ధంగా, కథకు కావలసిన రూపంలో, కాగితంమీద ఎక్కించడమే తరవాయిగా అన్నీ అమరి సిద్ధంగా వున్నాయి.

అతని హృదయం దెబ్బతినివుంది. కాకిలోకం అతనిమీద అన్యాయంగా అపవాదు వేసింది. ఆడిపోసుకుంది. అతని నొక్కడినే కాకుండా ఆ పిల్లనుకూడ కనపడిన చోటల్లా కాకుల్లా పొడిచేస్తున్నారందరూ. ఒకటికి రెండుసార్లు కలుసుకుని, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ వచ్చినంత మాత్రాన, కర్మంజాలక కళ్ళు బడినంత మాత్రాన కాకిగోల చేస్తుందీ యీ కసాయి లోకం! అతనికి కడుపుడికిపోయింది. కోపం వచ్చింది. కానీ ఏం చెయ్యగలడు?

అందుకనే అతను కథలు రాస్తున్నాడు. కడుపుమంటవంతా కాగితాని కెక్కించి కసి తీర్చుకుంటున్నాడు.

"లోకులు కాకులవంటివారు..." కలం కదులుతూంది. కథ సాగిపోతూంది. అతని ధ్యానముద్ర భంగం చేయడానికి లోకమే కాకుండా కాకులుకూడ యత్నిస్తున్నాయి. ఎక్కడనుంచో వచ్చి ఓ కాకి ఎదురుగా తిష్ఠ వేసింది.

"ఏమి టబ్బాయ్ రాస్తున్నావు?"

"లోకం గురించి."

"ఏమని?"

"కాకులవంటివారని".

"ఎవరు చెప్పేరు నీకు?"

"ఎవరో చెప్పడమెందుకు? నాకే తెలుసు".

"ఎవరిని గురించి?"

"లోకంగురించి"

"కావచ్చు. కానీ నీకు కాకులనుగురించి ఏమి తెలుసు?"

ఈ కాకివచ్చి చెడ్డచిక్కే తెచ్చిపెట్టింది. కానీ అంత సులభంగా బెదిరిపోయే ఘటం కాదు అతను.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## 'అక్షర మూర్తి'

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

"లోకులూ కాకులూ వొక్కటే. ఒకే తరహా యిద్దరిదీ".

"అని ఎలా చెప్పగలవు?"

"పదిమందీ అంటారు గాబట్టి పెద్దలు చెప్పేరు గాబట్టి."

"పదిమందీ నువ్వు పెద్దమనిషివి కాదంటే అవునని వొప్పుకుంటావా? అయితే యీ శ్రమంతా ఎందుకు?"

చిన్న చిక్కులా కనబడి, చూస్తుండగానే పెద్ద సమస్యగా మారిపోతూంది. అతను మాట్లాడలేదు.

"అబ్బాయ్ నువ్వు కథలు రాసేవాడివి. అందరివంటి వాడివి కావు. నీలో వొక ప్రత్యేకత వుంది. పదిమందీ అన్నారుగదా అని నువ్వుగూడా బ్రాస్తే నీకూ గొర్రెపోతుకూ తేడా ఏమిటి చెప్పు?"

"మరి పెద్దలు చెప్పేరుగా?"

"పెద్దలంటే ఎవరు?

"పుస్తకాలలో గూడ రాసివుందిగా?"

"నేను రాకపోతే నువ్వూ యీపాటికో పుస్తకం రాసిపడేసే వాడివి. ఎవరో రాశారుగదా అని ఎరువు తెచ్చుకోవడమేనా, లేక ఏమిటి సంగతని ఆలోచించడం, అర్థంచేసుకోడానికి ప్రయత్నించడం, ఏమైనా ఉందా?...

అతను తల వంచుకున్నాడు.

"ఎందుకు తమ్ముడూ సిగ్గుపడతావు? ఎందరో వున్నారు నీలాంటి వాళ్లు. కళ్లు తెరచి చూడలేరు. కానీ లోకాన్ని మరమ్మతు చేయడానికి కంకణం కట్టుకుంటారు. ఒక రహస్యం చెబుతున్నా విను. వొంటబట్టించుకో. ఏదైనా ఒక విషయం జనశ్రుతంగా వచ్చినంతమాత్రాన, పరంపరాగతంగా చెలామణీ అవుతున్న కారణాన దానిని నువ్వు అక్షరాలా సత్యం అని నమ్మవలసిన అగత్యం లేదు. ఈ పెద్దలు ఏవేవో చెబుతుంటారు చెప్పినదానిని ఋజువుచేయడానికి ఏవేవో నీతులను, సామెతలను గుత్తకు తీసుకుంటారు. అంతమాత్రంచేత నువ్వు హడిలిపోయి అవుననక్కర్లేదు. ఈ పెద్దలు చెప్పినవాటిలోనే పరస్పరవిరుద్ధములైనవిషయాలనేకమున్నాయి. "తినగతినగ వేము తియ్యనుండు" అంటా డొకాయన. "తినగా తినగా గారెలు చేదెక్కుతాయి" అంటాడు మరొకడు. ఏదినిజం? ఏదబద్ధం? రెండూ బహుళప్రచారంలో వున్నవేనే. వీటిలో దేనినినమ్మాలి? దేనినిమానాలి? అందుకనే అంటున్నాను. పెద్దలు చెప్పేరు కాబట్టి నువ్వు గంగిరెద్దులా బుర్రూపక్కర్లేదు. ఎటొచ్చీ కొంచెం బుర్రకు పని చెప్పాలి."

వోపిగ్గాకూర్చునివింటున్నాడు. చెబుతూ చెబుతూన్న కాకి టుక్కున ఆగిపోయింది. వీధివైపు చూసింది. ఎవరో దౌర్భాగ్యుడు రోడ్డుమీదపడి దొర్లుతున్నాడు. గిలగిల కొట్టుకుంటున్నాడు.

"ఎవరతను?" అడిగింది కాకి.

"ఎవరో మూర్ఛవాడు"

"ఎందుకలా పడి పొర్లుతున్నాడు?

"వాడికి మూర్ఛరోగం"

"పాపం కాళ్లూ, చేతులూ తపతప కొట్టుకుంటున్నాడు. తల నేలకేసి బాదుకుంటున్నాడు"

"అవన్నీ రోగలక్షణాలు"

"అరెరె. ఎంత బాధపడుతున్నాడు! ఎవరూ వాడి మొహమైనా చూడరే! దారికడ్డుగా పడివుండి, దారుణంగా బాధపడుతుంటే తలవంచుకుని తమదారిన పోదన్నట్లుగా తప్పించుకుపోతున్నారే!"

"అంతకంటె ఏంచేస్తారు? అలవాటైపోయింది. అయినా రోజూ చూస్తున్నదేగా?"

"అయితే రోజూ జరుగుతున్న దరిద్రమేగా బట్టి ఆత్మే బాధపడక్కర్లేదంటావు. అంతేనా?"

"అదికాదు. అదంతా నాటకం. వాడికి మూర్ఛా లేదు. ఏమీ లేదు. ప్రజల మనసుల్ని కరగించడంకోసం మోసం చేస్తున్నాడు"

"మోసమా? మొహం పగిలి రక్తం కారుతూంటే! అదంతా బూటకమేనన్న మాట! అయితే యీ నాటకమంతా ఎందు కాడుతున్నాడంటావు?"

"పొట్టకూటుకి"

"తిండికోసం తల పగలకొట్టుకుంటున్నాడా? తోటిమానవుడు కదా తలో కానీ పడేస్తే పోయిందేముంది మీకు...?"

"పడెయ్యక పోడానికి కారణాలు చాలా వుంటాయి. పైగా ఎవరి బాధలు వారికున్నాయి."

కాకి ఉన్నట్లే వుండి 'కావు కావు'మని అరవడం మొదలు పెట్టింది. రెక్కలు రెపరెప లాడించి రివ్వున ఎగిరిపోయింది. అతని కళ్లు కాకిని వెంబడించాయి. ఎక్కడెక్కడున్న కాకులూ వొక్కసారిగా వచ్చివాలిపోయాయి. కాకి గోలతో దిక్కులు పిక్కటిల్లి పోయాయి.

ఒక కాకిపిల్ల నేలమీద పడివుంది. అతి కష్టంమీద రెక్కల్ని అల్లలాడిస్తూంది. మెడ పక్కకు వాల్చేసింది. కాకులన్నీ దాని చుట్టూ మూగేయి. అతను అలా చూస్తూనే వున్నాడు. ఆ కాకులన్నీ అలా గోల చేస్తూనే వున్నాయి. సానుభూతితో సంతాపం తెలియచేస్తున్నాయి.

కొంతసేపటికి ఆ కాకిపిల్ల కొద్దిగా కదలింది. కష్టంమీద లేచి నిలబడింది. మెల్లిగా మెడ పైకెత్తింది. రెక్కల్ని పూర్తిగా విప్పింది. రెండు గంతులేసింది. పైకి ఎగిరిపోయింది. కొంతదూరం సాగనంపి కాకులన్నీ చెదరిపోయాయి.

"పాపం గద్ద తన్నిందట. గిలగిలలాడిపోయింది. చూస్తుంటే గుండెలు పగిలిపోయాయి".

అతను పరధ్యానంగా ఉన్నాడు.

"ఏమిటోయ్ ఆలోచిస్తున్నావు?"

"ఆలోచించడం లేదు. అర్థం చేసుకుంటున్నాను".

"కాకిగోలంటే ఏమిటో అర్థమైందా తమ్ముడూ? కాకులు గోలచెయ్యవు. గోడు చెప్పుకుంటాయి. కష్టం చూసి కదలిక పొందని మీ మనసులు మొండికెత్తిపోయాయి; బండబారిపోయాయి. దయాదాక్షిణ్యాలు, కరుణ, అంతఃకరణలు, సానుభూతి

"మా కోరాలు మీలో నిర్లక్ష్యం చేత కప్పబడి పోయాయి. అందుకనే మాకది గోలగా ఉంటుంది."

మూర్ఖవాడి వైపు చూశాడు. అతను మొదటిసారిగా కంట తడిపెట్టేడు.

"బట్టలు మార్చుకో తమ్ముడూ బయటకు వెళ్దాము" అంది కాకి. త్వరగా తెమిలిపోతున్న అతన్ని చూసి, చిరునవ్వునవ్వింది.

"తొందరలేదు. తల బాగా దువ్వుకో. ఎంత కథలు రాసేవాడివైనా అంత నిర్లక్ష్యంగావదిలేయగూడదుజుట్టుని. అందులో కథలురాసేవాడి కసలు నిర్లక్ష్యము నేదే పనికి రాదు."

ఉత్తర కుమారుడు నిరుత్తరుడయ్యాడు. ఇద్దరూ బయటకు బయలు దేరేరు.

పెళ్ళిపందిరి. పచ్చని తోరణాలు. రంగు రంగుల విద్యుద్దీపాలు. కళకళలాడిపోతూంది. సందడిగా వుంది. సంతోషంగా వుంది. పేదసాదలను పిలిచి మరీ అన్నదానం చేస్తున్నాడా గృహస్థు. కుంటి, గుడ్డి, మూగి, రోగి అందరూ ఎగబడుతున్నారు. ఒకరి నొకరు తోసుకుంటున్నారు. తిట్టుకుంటున్నారు. తిన్నుకుంటున్నారు. కలకలం హెచ్చిపోయింది. అన్నమంతా అయిపోయింది. గృహస్థు లోపలకు వెళ్లిపోయాడు. ముష్టివాళ్లందరూ అల్లరి చేస్తున్నారు. కల్లోలం లేవదీశారు. తోరణాలు తెంపేస్తున్నారు. తోసుకు చస్తున్నారు.

"ఏమిటి తమ్ముడూ యీ హడావుడంతా?" ఏమీ ఎరగనట్లడిగింది కాకి.

"ఏముంది? కాకి మూక. అందరినీ తృప్తి పరచ లేకపోయినందుకు ఆ గృహస్థును పట్టుకొని అచ్చ తెలుగులో ఆశీర్వదిస్తున్నారు."

ముష్టివాళ్ళ గొడవ మితిమీరిపోయింది. కనికరాన్ని అవతలకునెట్టి కర్రను చేపట్టి లేచి వచ్చింది గృహస్థు. పెళ్ళివారి భోజనాలు పూర్తయినట్లున్నాయి. ఆఖరి పంక్తి గూడ లేచిపోయింది. ఎంగిలాకులు తెచ్చి వీధిలో పడేశారు. కొసుక్కొర్చున్న ముక్కలు, మెతుకులు విస్తళ్లమీద విరుచుకు పడ్డాయి.

కాకి 'కావు కావు'మని అరవడం మొదలెట్టింది. అన్ని వైపులనుంచీ అదే ధ్వనితో సమాధానాలు వచ్చాయి. కాకిమూక వచ్చి పడిపోయింది. బారులు తీర్చి నిలబడింది. మెతుకుల్ని ముక్కున కరచుకుని ఒక్కొక్కటే పక్కకు తొలగిపోతూంది.

"మా కాకి మూకను చూశావా తమ్ముడూ?" అడిగింది కాకి.

"చూస్తున్నాను."

"ఎంత బుద్ధిగా కూర్చున్నాయో చూశావా? అరమరికలు లేకుండా కలిసి కట్టుగా వుంటాయి. కావలసినంత తింటాయి. అంతేగాని ఒకదానితో వొకటి కొట్టుకు చావవు. రెండు కాకులు తిండి కోసం తన్నుకు చావడం ఎప్పుడైనా చూశావా?"

"చూసినట్లు జ్ఞాపకం లేదు."

"కొట్టుకోకపోడానికి కారణ మేమిటంటావు?"

"ఏమో నాకు తెలియదు."

"ఏమంత పెద్దదికాదులే. మేము కాకులం, పరస్పరం మీదపడి మారణహోమం చేసుకోడానికి మనుష్యులం కాము. లోకాన్ని పట్టుకొని నువ్వు కాకి మూకంటావు. ఆమాటవింటే లోకం అవమానంతో పడిచస్తుందనుకుంటావు. కానీ ఆ సంగతి మా కాకులు తెలుసుకున్నాయంటే ఆత్మహత్య చేసుకుంటాయి. లోకంమీద కత్తుగట్టి నువ్వు కాకులపీకలమీదకు తెస్తున్నావు."

అతను సిగ్గుతో తల వాల్చేశాడు. నేలను చూస్తూ నడవడం మొదలెట్టేడు. పైన కాకి, కింద కథకుడు యిద్దరూ కలసి వెళ్తున్నారు. కాలేజీ సమీపించారు.

"ఎవరా అబ్బాయ్? ఆ చెట్టుకింద నిలుచున్నాడు. పిల్లదానిలా పువ్వుల జాకెట్ తొడుక్కున్నాడు...?"

"వాడా? పూలరంగడు."

"పేరు బాగానే వుంది. ఏదో అంటున్నాడే? ఎవరుచెప్మా ఆ అమ్మాయి? వేలు పెట్టి మరీ చూపిస్తున్నాడు!"

అతను ఆ అమ్మాయివైపు చూశాడు. ఆడుతూ అడుతూవున్న గుండె అమాంతంగా ఆగిపోతుందేమోననుకున్నాడు. ఆఅమ్మాయే! తనతో మాట్లాడిన నేరానికి తలో రాయీ విసిరేస్తున్నారందరూ. వెధవలోకం వేసే అపవాదులతో తల బొప్పికట్టిపోయింది. తన తల రెండుచేతులతో గట్టిగా పట్టుకున్నాడతను.

"కంగారుపడుతున్నావెందుకు? కథానాయకురాలు కాదుగదా?" కనిపెట్టేసింది కాకి.

"ఏమిరోయ్! అలా నిలబడ్డావేమిటి? త్వరగా రావాలి. లేకపోతే ప్రియురాలు పారిపోతుంది" పూలరంగడు పిలిచాడు. పక్కనున్నవాళ్లు ఘక్కుమన్నారు.

"ఏడెవడో ఘటికుడిలా వున్నాడే! వొకసారి దగ్గిరకువెళ్లి దర్శనంచేసుకోవాలి." చెట్టుమీద వాలింది కాకి. సరిగ్గా పూలరంగడినెత్తిపైన కూర్చుంది.

అతను ధర్మసంకటంలో పడ్డాడు. వుండడానికి వీలులేదు. పోడానికి దారిలేదు. పైగా కాకి చెట్టెక్కి కూర్చుంది. కదిలే వాటంలో కనబడడంలేదు. ఏం చేయడానికీ తోచక అలా నిలబడిపోయాడు. ఆపిల్ల తల వంచుకుని తనదారిని వెళ్ళిపోయింది. అంతా తలోబాణం వేశారు. పదిమందిలోనూ పూలరంగడు పైచెయ్యనిపించుకున్నాడు.

వ్యాఖ్యలు, విమర్శలు జోరుగా సాగిపోతున్నాయి. వొంటరిగా వచ్చినవాళ్లందరూ తాటాకుల జంటగట్టించుకు మాటీపోతున్నారు. వెక్కిరింతలు, వేళాకోళాలు, ఎత్తిపొడుపులు – అన్నిటికీ అధ్వర్యం వహిస్తున్నాడు రంగడు. అనుయాయులందరూ అతన్ననుసరిస్తున్నారు. ఆదారినే వస్తున్న వొక జంట రంగడి పరివారం కంట బడింది.

"ఎంత బాగుందో చూడరా!"

"ఏం చక్కావుంది గదరా?"

(46-వ పేజీ చూడండి)

# మిట్ట పల్లాలు



జి. వి. జి. కృష్ణ

సాయంత్రం ఆరుగంటలు దాటింది. నేనూ, రావూ మెరీనాబీచ్‌లో ఒక చోట కూర్చున్నాం. నేనేదో విషయం గురించి చెప్తూంటే రావు చెవు లప్పగించి ఆసక్తితో వింటున్నాడు.

"బాబూ!" ఉన్నట్టుండి వెనుకవైపు నించి కేక వినపడింది. త్రుళ్ళిపడి వెనుతిరిగి చూశాను. పదేళ్లకుర్రాడు. చినిగిపోయిన దుస్తులతో, శుష్కించిపోయిన దేహంతో దీనంగా చూస్తున్నాడు. "మీ బూడ్సులకు పాలిష్ వేస్తాబాబూ! అణాడబ్బు లిప్పించండి."

నా బూట్లవైపుకి ఓమారు దృష్టి మరల్చాను. నిగనిగలాడుతున్నాయ్. ఉదయమే పేపెఇచ్చి పాలిష్ వేయించాను. ఆ కుర్రాడి కేసిచూస్తూ "అక్కర్లేదు - పో," అన్నాను.

"ఊఁ తర్వాత ఏం జరిగిందో చెప్పవోయ్!" ఓవంక రావు తొందరచేస్తున్నాడు.

"ఆఁ..ఎంతవరకూ చెప్పాను?" అన్నాను. రావు అందించేలోగా ఆ కుర్రాడు మళ్ళీ అడ్డుతగిలాడు. "బాబూ! పుణ్యంవుంటుంది ...అణా ఇప్పించండి చాలు ... అద్దంలా పాలిష్ చేస్తాను."

విసుగుతో ఉగ్రుడయ్యాడు రావు. "వీ డొకడు - రామాయణంలో పిడకలవేటలాగు ...ఊఁ నువ్వు చెప్పవోయ్...ఆమె నిన్ను కారులో వాళ్లఇంటికి తీసికెళ్ళింది. తర్వాత ఏంజరిగిందో చెప్పు."

తర్వాత ఏం జరిగిందో చెప్పబోతున్నాను. ఈలోగా మళ్లీ "బాబూ!" -

రావు ఇహ కోపం పట్టలేకపోయాడు. "వెళ్తావా! పోతావా పోవా?" అంటూ ఆ కుర్రాడికేసి తీక్షణంగా చూశాడు. చూసిన వాడు మంత్రముగ్ధుడిలా అలాగే చూస్తూండిపోయాడు చాలాసేపువరకూ.

వాడికళ్ళల్లో ముత్యాల్లా, నీళ్లు నిలిచి వున్నాయ్.

"ఎందుకురా అలా ఏడుస్తున్నావ్? నిన్నెవరైనా కొట్టారా - తిట్టారా?" రావు కంఠంలో తీక్షణత ఇంకా వుంది.

ఆకుర్రాడు గద్గదకంఠంతో చెప్పాడు. "అందుక్కాదు బాబూ! తెల్లార్నించి తిరుగుతున్నా. పావలాడబ్బులైనా గిట్ట లేదు, దీపాలు పెట్టేలోగా అర్ధరూపాయ డబ్బులైనా ఇంటికి తీస్కెళ్ళకపోతే..."

"ఊఁ....ఇంటికి తీస్కెళ్ళకపోతే?"

"—మా అయ్య వీపు వొలిపించేస్తాడు" ఒక్కసారి బావురుమన్నాడా కుర్రాడు.

"ఇలా రావోయ్." రావు అనగానే ఆ కుర్రాడు బిక్కుబిక్కుమంటూ సమీపంగా వచ్చాడు.

"కూర్చో."

ఆ కుర్రాడు కూర్చున్నాడు.

"నువ్వు రోజుకు ఎంత సంపాయిస్తావ్?"

"అది తెల్లారి మొదటిబోణీబట్టి వుంటుంది బాబూ! ఒక్కోరోజు. ముప్పావలా, రూపాయీ సంపాయిస్తా. ఒక్కోరోజు పావలా కూడా రాదు. ఇయ్యాల ఎవరి మొహం సూశానో; తెల్లార్నించి తిరుగుతున్నా - టీనీళ్ళకైనా దొరకలేదు."

రావు కాసేపు ఆగి, తర్వాత ఇలా ప్రశ్నించాడు: "సరే....ఒక్కరూపాయ సంపాయించినరోజున ఏంచేస్తావ్?"

"తెల్లారి రెండు ఇడ్లీలు తింటాను. మద్దేల పావలాకు అన్నం. సాయంత్రం టీనీళ్లు తాగుతాను. అరణాలు పోనూ మా అయ్యకు పదణాలు ఇస్తాను. అంతకు తక్కువ ఇస్తే, మాఅయ్య తంతాడు."

"ఐతే రూపాయ దొరకనిరోజున ఏం చేస్తావ్?"

"ఏంచేస్తానూ - డబ్బులు చాలకపోతే మద్దిసేల కూడు మానేస్తాను. పదణాలకు తక్కువఇస్తే మా అయ్య ఊరుకోడుగా?"

"ఓరోజు ఆ పదణాలుకూడా దొరకకనుకో...అప్పుడేంచేస్తావ్?"

"మా అయ్యదగ్గర తన్నులు తింటాను."

"మీ అయ్యకేంపని?"

"ఏమీ లేదు బాబూ."

"ఏం?"

"ఒకసెయ్యి లేదు బాబూ! సిన్నప్పు డెప్పుడో తాటిసెట్టుమీంచి పడి సెయ్యి యిరగ్గొట్టుకున్నాడంట."

"ఐతేఇంట్లో ఊర్కనే కూర్చొనుంటాడన్నమాట."

"ఆఁ...అందర్నీ తిట్టూ కొట్టూ పడుంటడు బాబూ!"

"నీకు అమ్మ లేదూ?"

"లేదు బాబూ ... సచ్చిపోయింది ... మారుతల్లి వుంది; ఒక మారాజు ఇంట పాచిపని సేస్తూంటాది. అడనే దాని కడుపు నిండుతాది. ఇంటికొచ్చి మా సెల్లెల్ని ఊర్కనే కొట్టూంటాది బాబూ. నన్ను కూడా రోజూ ఇంకా డబ్బు తీస్కోరావాలని తిట్టూంటాది."

"ఐతే, నువ్వింత కష్టపడి ఇంటికి డబ్బులు తీస్కెళ్లి ఇస్తే, మీ అయ్య నిన్ను పట్టుకొని కొట్టూంటాడు కూడా నన్నమాట?"

ఆ కుర్రాడు బుంగమూతెట్టుకొని "ఔను బాబూ," అంటూ వెనుతిరిగి చొక్కా ఎత్తి వీపు చూపించాడు. ఆ నల్లటి వీపుమీద ఎర్రగా కందిపోయిన వాతలు కన్పిస్తున్నాయ్.

"నిన్న రేత్రంతా సలిజరం బాబూ... ఇయ్యాలకూడా వొళ్లు బాగాలేకుంటే ఎళ్ళక ఇంటికాడే పడుకుంటవన్నా. కట్టెతో వీపు ఇమానంమోత మోగించి తరమగొట్టిండు..."

"ఐతే మీ అయ్య నిన్నిట్లా అవ్వ



...గా కొత్త చంపుకొంటే నువ్వు పొదు గాం... తరు ఎందుకు వెళ్తావ్?"

"వెళ్ళకపోతే ఎట్లా బాబూ?...మా చెల్లెలికి దోసెలు ఎవరు తీస్కెళ్ళి ఇస్తారు?... నేను యీడ పడుకోలేదు?..."

"ఇక్కడే ఏ హోటలులోనైనా పడుకో."

"అయ్యో! నా పాలిష్ డబ్బా, బ్రష్ ఎవరైనా నేను నిద్రపోతున్నప్పుడు తీస్కెళ్తే?"

"నీ బూట్ పాలిష్ డబ్బా వెల ఎంతోయ్?"

"పన్నెండణాలు బాబూ!"

"బ్రష్ ఖరీదు?"

"అదికూడా అంతే బాబూ."

"ఒక పాలిష్‌డబ్బా ఎన్నిరోజులొస్తుంది?"

"నెల వస్తాది బాబూ."

ఆ కుర్రాడు లేచి ఓమారు ఇటూ అటూ చూశాడు: "వెళ్తా బాబూ! ఇంకెవరైనా తిరిగితే నాలుగు డబ్బులొస్తాయేమో..." అన్నాడు.

"ష్ఁ, పో పాపం" అన్నాడు రావు.

ఆ కుర్రాడు మా ఇద్దరికేసీ దీనంగా చూశాడు. "ఐతే పాలిష్ వేయించుకోరా బాబూ?"

నా గుండె గతుక్కుమంది. "నా బూట్లు చూడు...ఈ దయానే పాలిష్ వేయించానోయ్. లేకపోతే నీదగ్గర పాలిష్ చేయించుకునేవాణ్ణి," అంటూ జేబులోంచి ఒక అణాతీసి వాడికిస్తూ—

"ఇది తీస్కో...ఈమారు మళ్లీ ఎక్కడైనా అవుపిస్తే అడుగు. నీచేతే పాలిష్ వేయించుకుంటాను," అన్నాను.

అకుర్రాడు పుచ్చుకొని "వస్తా బాబూ!" అంటూ పోబోయాడు.

"ఆగు!" అన్నాడు రావు జేబులోకి చెయ్యి పోనిస్తూ.

ఆ కుర్రాడు ఆగాడు. రావు, జేబులోంచి ఒకపావలా తీసి చేతబట్టి ఆకుర్రాణ్ణి ఓమారు ఎగాదిగా చూశాడు: "చూడూ! నువ్విలా 'గలీజు' దుస్తుల్లోవుంటే నీ దగ్గరెవరూ పాలిష్ వేయించుకోరు. ఒక అణాఇస్తే బట్టలసబ్బు వస్తుంది. ప్రతిరోజూ రాత్రి ఇంటికి వెళ్ళాక శుభ్రంగా నీబట్టలన్నీ ఉతుక్కో. తెల్లారి మంచిదుస్తులు వేసుకొని తిరిగితే, అందరూ నీదగ్గరే పాలిష్ వేయించుకుంటారు ...... తెలిసిందా?" అన్నాడు రావు.

ఆ కుర్రాడు తల ఊపాడు.

"మరో సంగతి...నువ్వు మీ అయ్యకి పదణాలేగా ఇయ్యాలి....ఒకరోజు ఎక్కువ సంపాయించావనుకో-అప్పుడేం చేస్తావ్?"

"కూడబెట్తాను."

"అఁ....అదీ సంగతి ... మీ అయ్యకు తెలీకుండా ఎక్కడైనా డబ్బు కూడబెట్టూండు. నీ కెప్పుడైనా అవసరమొస్తే ఆడబ్బు సాయంవుంటుంది." అంటూ రావు పావలా అకుర్రాడికిస్తూ "చూడూ! నే చెప్పేవట్లంతా నువ్వు వింటావుకదూ? శుభ్రమైన దుస్తుల్లో తిరగాలి. అప్పుడే నువ్వు బాగా డబ్బు సంపాదించగలవు. అలా శుభ్రమైన దుస్తుల్లో నీటుగా నువ్వెక్కడైనా నాకు అవుపించాలి; ఇలాగే ఎప్పుడో ఓ రోజు కలుసుకుంటాంలే! అప్పుడు నువ్వు నాదగ్గిరికొస్తే నేను నీకు ఒక రూపాయ ఇనాం ఇస్తాను .... తెలిసిందా?" అన్నాడు.

ఆ కుర్రాడిమొహం సంతోషంతో వికసించింది: "సరే బాబూ."

"తర్వాత మరోవిషయం ... ఎవరైనా పాలిష్ అక్కర్లేదంటే నువ్వక వాళ్ళదగ్గిర్నించి వెళ్ళిపోవాలి. అంతేకాని, ఇందాకటిలా వాళ్లదగ్గర బతిమాలుతూ కూర్చుంటే వాళ్ళకు నీమీద అసహ్యంవేస్తుంది నిన్ను తిట్తారుకూడా. అంచేత వాళ్ళముందు ఇంకోక్షణం నిలుచోకుండా తిన్నగా వెళ్ళిపోవాలి. వాళ్ళిచ్చేడబ్బు నీకు వేరే ఎక్కడైనా దొరక్కుండా వుంటుందా?"

రావు ఒక కంపెనీలో సేల్స్‌మెన్‌గా పని చేస్తున్నాడు. అంచేతనే ఆ విషయంగురించి ఆ కుర్రాడితో అంతక్కా చెప్పగల్గుతున్నాడు. రావు అంతటితో ఆగలేదు. ఆ కుర్రాడి ముఖకవళికలను పరిశీలిస్తూ మళ్ళీ ఇలా చెప్పసాగాడు:

"నే చెప్పినవంతా జ్ఞాపకం వున్నాయి కదూ? అలా కష్టపడి సంపాయించాలి. అన్నట్లు మరోవిషయం. ఇప్పుడు ఈ అయ్యగారొక అణా, నేనొక పావలా ఇచ్చాం. నువ్వు ముష్టివాడిలా పుచ్చుకున్నావు. అది తప్పు. ఇటుపైన అలా ఎవరైనా ఇస్తే నువ్వు పుచ్చుకోకూడదు. అక్కర్లేదని చెప్పాలి. 'నాకు దేవుడు శక్తి ఇచ్చాడు - కష్టపడి సంపాయిస్తాను' అని చెప్పాలి.... తెలిసిందా?"

ఆ కుర్రాడికి ఈపాటికి విసుగెత్తిపోయి వుంటుంది. చేతులు జోడించి మా ఇద్దరికీ నమస్కరించి "నే వెళ్తా బాబూ," అన్నాడు సెలవు తీసుకుంటూ.

అకుర్రాడు కనుమాపుమేర దాటేవరకూ మేమిద్దరమూ వాడికేసి చూస్తూ కూర్చున్నాం.

"బుద్ధిమంతుడల్లే వున్నాడు; మంచి కుర్రాడే," అన్నాడు రావు.

నేను శిరఃకంపనం చేశాను.

* * *

హోటల్లోని రేడియోగ్రామ్‌నించి 'మారిపోవురా కాలము' అన్న పాట వినిపిస్తోంది. 'నిజంగా కాలం రోజురోజుకీ ఎలా మారిపోతోందీ,' అనుకుంటూ ఎదురుగా కూర్చొని ఫలహారం తింటూన్న రావుకేసి చూశాను.

సంస్కారంలేని జుట్టుతో, పెరిగిపోయిన దాడీతో, వెన్నుకు అంటుకుపోయిన కమీజుతో ఇప్పుడు ఓ కళేబరాన్ని గుర్తుకు తెస్తున్నాడు రావు.

రావును నేను అంతకు క్రితం బీచ్‌లో కలిశాను. అంతే. ఆ తర్వాత మళ్ళీ కలుసుకోలేదు. అప్పటికీ ఇప్పటికీ దాదాపు ఆరు

మూసారైంది. రావు సేల్స్‌మెన్‌గా పనిచేస్తూన్న కంపెనీ నాలుగు మాసాల క్రితం దివాలా తీసిందట. దాంతో రావు నిరుద్యోగి అయ్యాడు. వేరే ఎక్కడ ప్రయత్నించినా ఉద్యోగం దొరకలేదట. అతి కష్టంమీద రోజులు వెళ్లదీస్తూండాలి. పాపం! అతనూ, అతని పెళ్లామూ, చంటిబిడ్డా!

"రావ్! రెండిడ్లీలు, పూరీలు-పార్శిల్ కట్టెయ్యమనేదా? ఇంటికి తీస్కెళ్లు."

"ఎందుకులేవోయ్.." అన్నాడు రావు, అభిమానం అడ్డొచ్చింది కాబోసు.

"ఆఁ....ఎందుకేమిటి? ఇప్పుడు నీకడుపు నిండింది. మరి మీ ఆవిడకు?"

రావు జవాబు చెప్పలేదు. ఏం చెప్పగలడు ఆస్థితిలో? ఇడ్లీలూ, పూరీలూ పార్శిల్ కట్టించి రావు కిచ్చాను.

రావుకళ్లు చెమ్మగిల్లాయ్. చేతులెత్తి నాకు నమస్కరిస్తూ "దేవుడిలా అవుపించావ్... లేకపోతే యీ రోజుకూడా నేను ఆకలితో అలమటించిపోయేవాడ్ని. నేను సంపాయించే రోజుల్లో బంధువులందరూ నా చుట్టూ చేరేవారు. ఇప్పుడో- నాకష్టం వినేవాడుకూడా లేడు.. ఈస్థితిలో మిత్రుడవైనందుకు నీవు నీ పేరు నిలబెట్టుకున్నావు" అన్నాడు. కంఠం బొంగురుపోయింది. రావు మాసిన దుస్తులకేసి చూస్తూ బరువుగా ఒక్క నిట్టూర్పు వదిలాను.

రావు చేతులు పిసుక్కుంటూ "ఒక రెండురూపాయలుంటే ఇయ్యగలవా?" అన్నాడు.

"ఎందుకూ?"

"కావాలి... పాపాయికి ఒళ్లు బాగోలేదు. న్యుమోనియా. డాక్టర్ దగ్గరికి తీస్కెళ్ళకపోతే మాకు దక్కుతాడో లేదో తెలీకుండా వుంది."

జేబులోకి చెయ్యి పోనిచ్చి మనీపర్సు తీశాను. రావుదురదృష్టం కాకపోతే ఎప్పుడూ డబ్బడగని అతను ఈవేళ నన్ను డబ్బు అడిగితే, ఎప్పుడూ ఏ ఐదురూపాయలో వుండే మనీపర్సులో ఇప్పుడు అరణాలే ఎంగుకుంటాయి! ఇందాక నే షాపులో కొన్ని వస్తువులు కొనేశాను. లేకపోతే కనీసం రెండురూపాయలైనా వుండేవి. రావుకు ఇప్పుడు సాయంచేసే స్థితిలో లేనందుకు మనస్సు చివుక్కుమంది. "సారీ రావ్! సమయానికి డబ్బు లేదు. లేదా ఒకపని చెయ్యి. రేపు ఉదయం మా ఆఫీసుకి ఓమారు రాగలవా? నేను అడ్వాన్సు తీసుకొని నీకిస్తా. ఏం?"

రావు తల ఊపాడు.

"మర్చి రాకపోయేవు?...తప్పకుండా రావాలి...ఏం?"

రావు జేబులోంచి పార్కర్-51 పెన్ తీస్తూ "ఇదో అంతా పోనూ, చివరికి మిగిలింది ఇదొక్కటే - కళామందిర్ వారు నాకిచ్చిన బహుమానం. ఇప్పుడు నిన్ను కలుసుకోకపోయివుంటే దీన్నికూడా అమ్మేసేవాణ్నేమో." అన్నాడు.

"రావ్! అంత పని ఎప్పటికీ చేయకు. అసలు నువ్వు ఇన్నిదినాలుగా నన్నెందుకు కలుసుకోలేదు? నన్ను కలుసుకొనివుంటే ఈపాటికి నీకు మా ఆఫీసులో ఏదైనా ఉద్యోగాన్ని ఇప్పించేవాడ్నిగా?"

కుక్క మాంసంముక్కకేసి ఎలా చూస్తుందో అలా రావు ఆశతో నా కళ్ళల్లోకి చూశాడు: "మీ ఆఫీసులో ఏవైనా ఖాళీలున్నాయా?"

నేను క్షణకాలం ఆలోచనలో పడ్డాను "బహుశః వుండొచ్చు. రేపు ఉదయం మా ఆఫీసుకి వస్తున్నావుగా...అప్పుడు కనుక్కొని చెప్తాలే!"

ఈలోగా—

"బాబూ!"

అదిరిపడి పక్కకి తిరిగిచూశాను. ఓ కుర్రాడు. శుభ్రమైన దుస్తులతో, చిరునవ్వుతో నిలుచునున్నాడు.

"పాలిష్ వేయనా బాబూ?"

అక్కర్లేదన్నాను.

ఆ కుర్రాడు రావుతో "మీకు బాబూ?" అంటూ అతనిబూట్లు లేనిపాదాలకేసి చూసి, నాలిక కొరుక్కున్నాడు. ఉన్నట్టుండి ఆ కుర్రాడు ఓసారి రావుకేసి, తర్వాత నాకేసి పరిశీలనగా చూసి "గుర్తున్నానా బాబూ?" అన్నాడు.

నేను వాడికేసి కాస్సేపు అదే పనిగా చూశాను. దాదాపు ఆరుమాసాల క్రితం బీచ్‌లో జరిగిన సంఘటన కొద్దికొద్దిగా స్ఫురణకు వస్తోంది. క్షణకాలం నివ్వెరపోయాను. "ఒరే - నువ్వా?" అన్నాను.

ఆ కుర్రాడు సంతోషంతో తల ఊపాడు.

రావు మర్చిపోయినట్లుంది. అతని కింకా జ్ఞప్తికి రావటం లేదు. "రావ్!... నీ ఫ్రెండోయ్!" అన్నాను.

రావు తికమకలు పడ్తూ ఆ కుర్రాడికేసి చూశాడు.

"గుర్తొచ్చానా బాబూ? ఆనాడు బీచి దగ్గర మీరు చెప్పినట్లే ప్రతిరోజూ గుడ్డకుల సోపేసి తెల్లగా ఉతుక్కుంటున్నాను. చూడండి నాగుడ్డలు! మా అయ్యకి తెలీకుండా ఐదురూపాయలు ముసలయ్య మాఁవ కాడ ఇచ్చి పెట్టినా..."

రావుకు కొద్దికొద్దిగా స్మృతికి వస్తూన్నట్టుంది. తలయెత్తి ఆ కుర్రాడికేసి సరిగ్గా చూడలేకపోతున్నాడు.

ఆ వైఖరి అర్థంకాలేదా కుర్రాడికి. "ఇంకా గుర్తుకు రాలేదా! ఆనాడు మీరు చెప్పారుగా బాబూ!—నేనిట్లా మంచి గుడ్డలేసుకొనివస్తే ఒక రూపాయి ఇనాం ఇస్తానన్నారుగా?"

రావు కాస్సేపు కళ్లు మూసుకొని మహా అవస్థలో పడిపోయాడు. తర్వాత నాకేసి తిరిగి "పిడిచేత నీ బూట్సులకు పాలిష్ వేయించుకుంటూవుండు... ఇప్పుడే వస్తా" అంటూ రావు నాజవాబుకు ఎదురు చూడకుండానే ఎక్కడికో వడివడిగా వెళ్లిపోయాడు.

నాబూట్లకు పాలిష్ వేయటం ముగిశాక రావు వచ్చాడు. నేను ఆ కుర్రాడికి పాలిష్ వేసినందుకు అణా ఇచ్చాను. ఆ కుర్రాడు పుచ్చుకొని చిరునవ్వుతో "వస్తా బాబూ," అన్నాడు మా ఇద్దరికేసీ కృతజ్ఞతతో చూస్తూ.

రావు షర్ట్ జేబులోంచి ఒక రూపాయి నోటు తీసి ఆ కుర్రాడి కిస్తూ "ఇందా- తీసుకో" అన్నాడు.

ఆ కుర్రాడు పుచ్చుకోలేదు. "ఆయేళ మీరే అన్నారుగా బాబూ......ధర్మంగా ఇస్తే పుచ్చుకోవొద్దన్నారుగా! వొద్దు బాబూ. నేను కష్టపడి సంపాయిస్తాలెండి."

రావు మొహం ఎఱ్ఱబారింది "పుచ్చుకోమంటూంటే?" ఆ కుర్రాడి కళ్ళల్లోకి తీక్షణంగా చూస్తూ గర్జించాడు.

ఆ కుర్రాడు బిక్కుబిక్కుమంటూ ఆ రూపాయి పుచ్చుకొని అక్కడ్నించి కదిలాడు.

రావువైపుకి తిరిగాను: "ఎక్కడిది నీకా రూపాయ్?"

రావునోట మాట పెగల్లేదు. తల వొంచుకున్నాడు. అప్రయత్నంగా రావు షర్ట్ జేబుమీదికి పోయింది నా దృష్టి. ఆ జేబులో ఇందాక గోల్డ్ కేప్‌తో మెరుస్తూండిన పార్కర్—51 పెన్ ఇప్పుడు లేదు!

"నీ పెన్ ఏమైంది?"

రావు తల విదిలించాడు. "వస్తా...రేపు ఉదయం మీ ఆఫీసుదగ్గర కలుసుకొంటా," అనిమాత్రం అనేసి పెద్దపెద్ద అంగలతో వడివడిగా వెళ్ళిపోతున్నాడు.

"రావ్!...ఆగు....మాట!"

ఇంకెక్కడ ఆగుతాడు? వడివడిగా వెళ్లి సందుమలుపులో తిరిగి అదృశ్యమైపోయాడు. బరువుగా నిట్టూర్చాను. ★

పెద్దకథ:



# ఇద్దరమ్మాయిలూ – ముగ్గురబ్బాయిలూ

(గత సంచిక తరువాయి)

రాత్రికి బంగారయ్యగారు పంతులుగారి బడిలో రామభజన, పురాణ కాలక్షేపం ఏర్పాటు చేశాడు. ఊరంతా దండోరా వేయించారు.

రామారావు మావయ్యా, పెద్దమనుషులూ మండిపడ్డారు దండోరా విని.

"మాశావుటోయ్—వీడి గుంటనక్క ఎత్తులూ వీడూనూ—రేపు ఎన్నికలు పెట్టుకుని ఇవాళ భజనలూ హరికథలూ పెట్టిస్తాడూ జనాన్ని వశపరచుకోడానికి! హమ్మ సెనవ! హెంత పన్నాగం!" అన్నాడు సూరయ్య.

"సూరయ్యగోరూ—యీడి పోటీ తట్టుకోవాలంటే మనం సానిమేళం ఎట్టించాలి. బలే రంజుగా ఉంటది" అన్నాడు సుబ్బిశెట్టి కళ్లెగరేస్తూ.

"మేళ మెందుకేస్ ఈపాటిదానికి. మేళమంటే మాటలనుకున్నావా ఏం. డబ్బు ఖర్చుతో పని. మనవూఁ భజనే పెట్టిస్తే సరి" అన్నాడు కంట్రాక్టరు నవ్వుతూ.

గవరయ్య వారించాడు. "మీకు తెలీదండీ. భజన కూడా పెట్టకూడదు నన్నడిగితే. వాడు పెట్టాడని మనమూ పెడితే పోటీ భజనంటారు. బాగుండదు. అదీకాక చేతిదము రెంగుకూ?—అయినా వీడి భక్తి చట్టుబండలు గానూ—ఇదటయ్యా పద్ధతి! మనం దండోరా వేయించాలి 'మాకు దొంగ భక్తి లేదూ, మాంసం తింటే ఎముకలు వేళ్లాడగట్టుకుని తింటారా—అంచేత మాకు భక్తి పుష్కలంగా ఉన్నా మేము భజన పెట్టించలేదూ—రామమందిరం కట్టించడం ద్వారానే మాభక్తి వెల్లడవాలిసి అని చాటిస్తే చాలదయ్యా" అన్నాడు.

సూరయ్య ఆలోచించాడు. "చాటింపొద్దుగానీ మనవేఁ నలుగురికీ చెప్పేద్దాం" అన్నాడు.

బంగారయ్యగారు ఏర్పాటు చేసిన భజనకి చాలా మంది జనం వచ్చారు. సుబ్బలక్ష్మి వచ్చింది. రామారావుని దూరంనించి చూసింది. ఆమె మందహాసం రామారావుకి కనపడిపోయింది.

హరికథ పూర్తికాకుండానే జగన్నాథంగారొక్కరూ ఇంటికెళ్లిపోయారు.

ఇదిమాని వీర్రాజు సుందర్రావుని పిలిచాడు. "ఆయన ఒక్కడేవెళ్లాడు సుందరం. ఇప్పుడే వెళ్లి చెప్పెయ్. నువ్వు సుబ్బుల్ని చేసుకోవనీ, పైగా చెన్నపట్నం వెళ్ళిపోతున్నావనీ - పనిలోపని - రామారావుకి - ఒద్దులే - నీసంగతి చెప్పెయ్ చాలు" అన్నాడు.

సుందరం నవ్వాడు. హరికథ అవనిచ్చి సుబ్బుల్నీ వాళ్లమ్మనీ దిగబెట్టే నెపంతో వెళ్ళి మాట్లాడేస్తానన్నాడు.

రామారావు మర్నాడీ సంగతి విని "హమ్మయ్య" అన్నాడు. "పంతులూ-సమస్యలు మెల్లిగా పరిష్కరించి అవతల పారేస్తున్నాం" అన్నాడు కథాసంగ్రహాన్ని ఒక్కమాటు సమీక్షిస్తూ.

ఇంక ఒక్కటే తరువాయి. మావయ్య ఓడిపోవడం. కరణంగారితో తనవిషయమై చేసుకున్న ఒప్పందానికి ఎగనామం పెట్టడం. మూడోదీ ముఖ్యమైనదీ సుబ్బలక్ష్మి పెళ్లి. ఇందులో సగంపని పూర్తి అవనే అయింది. సుబ్బులుకితనంటే ఇష్టంవుంది. సీతకి తనంటే ఇష్టంలేదు. రాజుకి సీతంటే యిష్టం. సీతికి 'రాజ్' అంటే ఇష్టం. మావయ్య పన్నాగంలో ఒక భాగమయిన సుందరం - సుబ్బలక్ష్మి వివాహం 'పకోడీ' మంత్రంతో భిన్నాభిన్నమైపోయింది. సుందరం

 ముళ్ళపూడి వెంకటరమణ 

# ఇద్దరమ్మాయిలూ - ముగ్గురబ్బాయిలూ

రాత్రి వెళ్ళి తను చిన్నపట్నం వెళ్ళిపోతున్నట్లు సుబ్బులు తండ్రితో చెప్పేశాడు.

ఇక ద్వితీయభాగం వకటే. ఈభాగంలో రామారావు ఆస్తి హీరోయిన్ అనగా కథానాయకి. కరణంగారు హీరో, లేక నాయకుడు. ఆయన రామారావుఆస్తి గాఢంగా ప్రేమించాడు. వరించడానికి తిప్పలు పడుతున్నాడు. ఈ స్వయంవరానికి సూత్రధారి రామారావు మావయ్య సూరయ్య. మావయ్య ఈ సత్కార్యానికి చేసే కృషివల్ల మావయ్యకి కరణంగారి ముఠా ఓట్లు వస్తాయి. ఓట్లు వస్తే ఎన్నికల్లో గెలుస్తాడు. గెలిస్తే రామమందిర నిర్మాణానికి కంట్రాక్టుని యోగించి తన బాకీనుంచి తప్పించుకుంటాడు. కంట్రాక్టరుకీ డబ్బు ముట్తుంది. ఊరి చివరన రామ మందిరం కడితే ఈసరయ్య వ్యాపారం బాగుపడుతుంది. చివరకి అంతా సుఖంగా వుంటారు.

కానీ రామారావే సుఖంగా ఉండడు. కథానాయకుడు మట్టికొట్టుకుపోయి దగుల్బాజీలు పరస్పరం రాజీలుపడి బాగుపడిపోతారు. అప్పుడు కథ కంచికీ జనం ఇంటికీ వెళ్ళడం కుదరదు.

"డామిట్! ఎక్కడో అక్కడ కథ అడ్డం తిరగాల్సిందే - లేకపోతే తిప్పాల్సిందే." అన్నాడు రామారావు.

రాత్రి హరికథ మూలాన్ని వీర్రాజుకి నిద్ర ముంచుకొస్తోంది. "ఏమిటోరా-రాత్రి దాసుగారు శెలవిచ్చినట్లు మనమంతా నిమిత్తమాత్రులం. అంతే - కథలు మనం అడ్డం తిప్పే దేవుందిరా" అన్నాడు ఆవలిస్తూ.

"అందుకే కథ అడ్డం తిరగడం మన చేతి మీదుగా వే జరగాలి" అన్నాడు. "నీ బొంద. నీ కంతశక్తేది. దొంగరాముడి ఎదాన పదిరూపాయలు పోశావు. వాడిచేత ఏవో చేయించి ఉద్ధరిస్తానన్నావు. వెధవ పత్తాలేడు - వాడి మూలాన్ని కథ ఎదురు తిరిగి యీ దొంగ రాముడుచేత దోచుకోబడిన మీ వాడి నేస్తాలు మరింత ప్రచారం చేస్తున్నారు. ఏమిటో!.... కాసేపు పడుకో ఇంటికెళ్ళి."

"ఊరు నానా గోలగాఉంటే నిద్రేమిట్రా బడుద్ధాయ్ లేరా." అంటూ బలవంతానవీర్రాజుని బయల్దేరదీశాడు రామారావు.

పదడుగులు వేసేసరికి సుందరం ఎదురయ్యాడు రావి నాయుడి జట్కాలో. "సాయంత్రం మెయిలుకే వెళ్ళడానికి నిశ్చయించుకున్నానండి. మీరుయిక అడ్డుచెప్పొద్దు మీకు నెల తిరిగేలోగా డబ్బు మనియార్డరు చేస్తా. మీ మేలు మరిచిపోలేను." అన్నాడు రామారావుతో. వీర్రాజు వంక తిరిగి "రాత్రే జగన్నాథంగారికి చెప్పేశానండి. ఆశ్చర్యపడ్డారనుకోండి. అమ్మాయి బాధపడుతుందని అన్నాడు. అమ్మాయికి ఎవరంటే ఇష్టమోనాకు తెలుసు. కావలిస్తే కనుక్కోండి అన్నా. ఆయన లోపలకెళ్ళి ఆవిడతో చెప్పాడు. ఆవిడ పేరు పేరునా చెప్పి అడిగింది—చివరకి వీరిపేరు (రామారావుని చూపిస్తూ) చెప్పగానే బోలెడు సిగ్గుపడి పెరట్లోకి పారిపోయిందండి" అన్నాడు.

అమాంతం సిగ్గుపడిపోయిన రామారావు పోగ బయటకి విడలబోయి లోపలకి మింగేశాడు. సుందరం మృదువుగా నవ్వాడు. "రామారావుగారూ. ధీరదృష్టవంతులు. సుబ్బులు బంగారుతల్లి...... సెలవండి" అని బండివాడితో "పోనీవోయ్ త్వరగా" అన్నాడు.

మధ్యాహ్నం మూడు గంటలయ్యేసరికి రచ్చబండ దగ్గిర పిల్లామేకా పోగయ్యారు. కాసేపటికి పెద్దలంతా చేరుకున్నారు. నవ్వులాటలూ ఎత్తిపొడుపులూ, ఎకసక్కాలు, ఏడుపులు, ఈలలు, వాదోపవాదాలూ మొదలైన సరంజామాతో అంతా గోలగోలగా, సందడిగా ఉంది.

సూరయ్య, బంగారయ్య ఉపన్యాసాలిచ్చారు. రామమందిరం ఊరుమధ్య ఎందుకు కట్టించాలో, ఊరుచివర ఎందుకు అవసరమో ఎవరికి వారు సమర్థించారు. ఊళ్లో స్వార్థపరులవల్ల నాశనం ఎలా దాపరిస్తుందో విడివిడిగా వివరించారు. అందరూ ఐకమత్యంగా ఉండాలని ఏకగ్రీవంగా ఉద్ఘోషించారు. అదే బలం అనికూడా అన్నారు. ఆతరవాత అదన్నారు ఇదన్నారు. ఆఖరున మీ ఓట్లు మాకే మీ పొట్లు మీకే అన్నారు.

సభికులలో కొందరు గంభీరంగా తలలూచారు మాటలవిలువలు తులతూచుతూ. కొందరు నవ్వారు. కొందరు హేళన చేశారు. అమారాజా డబ్బిచ్చి రామమందిరం కట్టించుకోండయ్యా అంటే ఈగోలా పోటీలూ ఏవిటన్నారు కొందరు గట్టిగా.

చివరకి ఓట్లు లెక్కపెట్టి వారో వీరో తేల్చే ముహూర్తం వచ్చింది. కరణంగారు పెద్దగా కూర్చున్నారు. తీరా అంతా సిద్ధమై సై అంటే సై అన్నాక కొందరు చేతులెత్తడానికి భయపడ్డారు. ఒక బీదరైతు బంగారయ్యకే నా ఓటు అంటూ చెయ్యి ఎత్తబోయాడు. వెంటనే సూరయ్య పార్టీవాడైన సుబ్బిసెట్టి (ఆఫ్ ఘంకొపలాస్ ఫేం) ఓ చూపు చూశాడు క్షణంలో సగంసేపు. చెయ్యెత్తబోయిన రైతు జావగారిపోయి మానేశాడు... ఈ ఏటి పంట సుబ్బిసెట్టే బేరం పెడతాడు. సెట్టికి కోపం వస్తే అది కాస్తా చెడుతుందని రైతుకి బాగా తెలుసు. అందుకని ఓటు ఉపసంహరించాడు.

"అదుగో బెదిరింపు... ఆ ఓటు నాకే... ఎత్తు చెయ్యి!" అని బంగారయ్య కర్కశంగా అరిచాడు. బంగారయ్య కేకలో కర్కశత్వం, కక్కుర్తి, అధికార దాహం

కొందరికి జుగుప్స కలిగించింది. రామారావుకి ఏవగింపుతో ఒళ్ళు జలదరించింది.

'ప్రజాస్వామ్యం' అన్నాడు వీర్రాజు.

'ముఠాస్వామ్యం' అన్నాడు రామారావు.

"దబాయింపుస్వామ్యం" అన్నాడు పక్కనే ఉన్న జగన్నాథంగారు.

జనంలో రొద ప్రారంభం అయింది. ఈ దారుణం చూడగానే కొందరికి అసహ్యం వేసింది.

"సూరయ్యగారికీ జై" అనేశారు కంట్రాక్టరూ సుబ్బిసెట్టీ సందుచూసి. వెంటనే అక్కడి కుర్రాళ్లంతా 'సూరయ్యగారికీ జై' అన్నారు. సుబ్బిసెట్టి అన్నాడని కొందరూ, కంట్రాక్టరు అన్నాడని ఈసరయ్య, అతని ముఠావాళ్లూ, లోపాయికారీ ఒప్పందంప్రకారం కరణంగారి జనం, సూరయ్య మరీ మరీ చెప్పి సిద్ధంచేసుకున్నవారూ ఈ జయధ్వానంలో ఒక్కసారిగా చేరారు. ఓటింగే జరక్కుండా సెట్టీవాళ్లు ఎందుకు జై అన్నారో ఎవరికి బోధపడలేదు.

బంగారయ్య కొంచెం తెల్లబోయాడు. తన పార్టీ మనిషిని మోచేత్తో పొడిచాడు. అతగాడు వెంటనే "బంగారయ్యగారికీ జై" అన్నాడు. బంగారయ్య మనుషులు గొంతులెత్తేలోగానే సూరయ్య మనుషులు మళ్ళీ జై జై సూరయ్యకీ జై అన్నారు. దాంతో కరణంగారు కండువా సవరించుకుని, "సూరయ్యగారే గెలిచారు. డబ్బు ఆయనకే ఒప్పగిస్తాం" అని ప్రకటించాడు. బంగారయ్య అభిమాని మునసబుగారు అడ్డుతగిలాడు. 'ఓటింగు లేకుండానే గెలిచినట్టు ఎలా ప్రకటించావయ్యా" అని గద్దించాడు.

"ఇంకా లెక్కెందుకండీ. అంతా ఆయనకే జైకొడుతున్నారు" అన్నాడు కరణంగారు సమరసభావంతో.

అమాంతంగా కంట్రాక్టరు అందుకోవారు మళ్లీ 'సూరయ్యగారికే' జై అన్నారు. పిల్లమేకా, పార్టీవాళ్లూ కలిసి హుషారుగా అందుకున్నారు 'జై' అని.

"హరహర! మా పెద్దదిక్కు మా ఇంటి మొగదిక్కుత ఇలా అన్యాయంగా గెలిచిపోతే నా గతేమిట్రా రాజా! కరణంగారు సూరయ్యని వదుల్తాడురా ఇంక" అన్నాడు రామారావు బాధగా.

"ఎలాగరా?" అన్నాడు వీర్రాజు.

కొలవగట్టుదగ్గిరనుంచి శృంగనాదం వినవచ్చింది. జనం అంతా అటు చూశారు 'ఉప్పుదో నె వచ్చింది సింగినాదం ఉదారు' అన్నాడు రామినాయుడు. కరణంగారు కాగితాలు సరుతున్నాడు, సూరయ్యకి డబ్బు అప్పగించే నిమిత్తం.

"ఓటింగులేందే కుదరదయ్యా" అన్నాడు బంగారయ్య.

"ఇంకా ఓటింగేమిటి అంతా తేలిపోతే" అన్నాడు కంట్రాక్టరు. సూరయ్యకీ జై అన్నాడు.

"ఆపండి ఆపండి. ఎన్నికలు ఆపండి. రామనాథంగారొచ్చారు ఎన్నికలాపండి" అంటూ కేకలేస్తూ ఊరి బడిపంతులు శంకరయ్యగారు ఒగుర్చుకుంటూ వచ్చాడు.

అందరూ స్తబ్ధులైపోయారు. కరణంగారూ బంగారయ్యా, సూరయ్యా కొయ్యబారిపోయారు.

శంకరయ్యగారు అరుగుమీద నుంచుని చెప్పారు "అయ్యలారా! మీరంతా ఒక్కసారి కొలవగట్టుకి దయచెయ్యండి. రామనాథంగారు రమ్మంటున్నాడు. ఆయన సన్యాసం పుచ్చుకున్నందువల్ల ఊళ్లోకి రాడు."

జనం అంతా బయలుదేరారు రకరకాలుగా ఆశ్చర్యపడుతూ. అందరికన్న ముందు శంకరయ్యగారు ఉత్సాహంగా నడిచాడు. ఆయనకి ఈవూరి రాజకీయాలు కూలంకషంగా తెలుసు. ఆయనమాట వినే పెద్దలెవరూ లేరు ఆయన బడిపంతులు కాబట్టి. ఆయన వాటితో ప్రమేయం పెట్టుకోడు. అందుకే ఎన్నికల సమయానికి కొలవగట్టుకి వెళ్ళి కూర్చున్నాడు.

రామమందిర నిర్మాణానికి నాలుగువేల రూపాయలు విరాళం ఇచ్చి, సన్యసించి రామేశ్వరం వెళ్ళిన రామనాథంగారికి, తన గ్రామంలో రామమందిరం ఏ దశలో ఉందో తెలుసుకుపోదామనే సంకల్పం కలిగింది. ద్రాక్షారామం వెడుతూ పనిగా స్వగ్రామం వచ్చాడు. యాదృచ్ఛికంగా ఆవేళకే అక్కడ కూర్చున్న శంకరయ్యగారు ఆయనకి ఊళ్లో గొడవ యావత్తూ పూసగుచ్చినట్టు తెలియచెప్పాడు.

కొలవగట్టున నీలాటిరేవుకు అరఘర్లాంగు దూరంలో రావిచెట్టుక్రింద ఉపవిష్టుడైన స్వాములవారికి జనం ప్రణామం చేశారు. పెద్దలు కొందరు కుశలం అడిగారు. కరణంగారూ, సూరయ్య, బంగారయ్య పోటాపోటీలుగా స్వాములవారిని తెగ పొగిడారు.

స్వాములవారు దేనికీ జవాబివ్వలేదు. అందరూ చెప్పదలచింది చెప్పడం అయ్యాక నిశ్శబ్దంగా ఉండమని కోరారు. జనం అంతా ఆయన మాటకోసం చెవులు రిక్కించుకు కూర్చున్నారు. చెట్టుమీద కూర్చున్న ఒక పిల్లకాకి, తెలీక, బాల్యచాపల్యంకొద్దీ 'కావుకావు' అంది. వాళ్లమ్మ 'హాఁ" అని గద్దించడంతో నోరు మూసుకుంది. ఇది చూసిన ఒక మేకపిల్ల 'మెమె' అని నవ్వి, గబుక్కున తప్పు గ్రహించి, నాలుక కరచుకొని చెట్టుచాటుకి తప్పుకుంది.

# ఇద్దరమ్మాయిలూ - ముగ్గురబ్బాయిలూ

స్వాములవారు తాను చెప్పదలచిన నాలుగు ముక్కలూ నిష్కర్షగా సూటిగా చెప్పారు. రామమందిరనిర్మాణం ఇన్ని గొడవలు తెస్తుందనీ, దాన్ని కట్టించే పెద్దరికం కోసం ఇంతమందికి పట్టుదలలు పెరిగి, స్పర్థలేర్పడి, రభస జరుగుతుందనీ తాము ఎన్నడూ భావించలేదన్నారు. రామమందిరం పేరు అడ్డుపెట్టుకొని చదరంగాలూ, పేకాటలూ సాగుతాయనుకో లేదన్నారు చాలా బాధ కలిగించిందన్నారు. స్వాములవారికి ఇక్కడి రాజకీయాలన్నీ తెలిశాయన్న సంగతి ఆయన నోటనే వెల్లడి కావడంతో, ఈ రభసతో రాజకీయాలతో ప్రమేయం లేని, ఏ పాపమూ ఎరుగని జనం సిగ్గుతో తలలు వాల్చారు. పెద్దమనుషులంతా ఇది ఈయనకి ఎలా తెలిసిందా అని ఊహాగానాలు చేయసాగారు.

అర్ధనిమీలిత నేత్రులై, స్వాములవారు గంభీరంగా ప్రవచించారు. "నేను దేముడిని వెతకడంకోసం సన్యసించాను. కాలి నడకన చాలా ఊళ్లు తిరిగాను. గుడిగోపురాలు చూచాను. భగవంతుడిగురించి నేనేమి తెలుసుకో కలిగానో చెప్పలేను. కాని మనుషులంతా మంచివాళ్ళై సుఖంగా ఉండడమే భగవంతుడికి ప్రీతికరమనీ ఆయన మనకు ప్రసాదించినవన్నీ అందుకేననీ, అందుకోసం ఎవరెంత కొద్ది చేసినా ఆయన సంతోషపడగలడనీ నాకు మనసారా అనిపించింది. నమ్మకం కుదిరింది. మన ఊళ్లో రామమందిరం కట్టించడానికి, పూర్వాశ్రమంలో నేను ఆరు మాసాలక్రితం యథాశక్తి కొంత సొమ్ము వదిలివెళ్ళేను. దానివల్ల పని కాకపోగా, ఊళ్లో స్పర్థలకు దారితీసిందని ఇప్పుడే తెలుసుకున్నాను. బాగా ఆలోచించుకోగా నాకు ఒకటి తోచింది. స్పర్ధలు పూర్తిగాపోయి, అందరూ కావాలనుకున్నప్పుడే రామమందిరం సుకరంగా కట్టుకోవచ్చు. నేను ఇచ్చిన డబ్బుతో ఈ ఊళ్లో పాఠశాల కట్టించాలని నా అభిమతం. మీ పిల్లలూ, తీరికైనపుడు మీరూ చదువుకోవచ్చు. ఇప్పుడు ఉన్న బడి ఒక తాటాకుల పాక. శిథిలావస్థలో ఉంది. అది పంతులగారి ఇల్లు. దాన్నే పెద్దచేసి బడి కట్టించండి. ఈ కార్యభారం యావత్తూ శంకరంగారే నిర్వహిస్తారు."

స్వాములవారిమాటలు జనానికినచ్చాయి. కొందరు తటపటాయించారు. భగవదర్పితమైన ధనం అన్యథా వినియోగించడం అసత్కార్యం ఏమోనని.

"దానికేముంది. బడిలోనే ఒక గదిని ప్రార్థన మందిరం చేయవచ్చు. అక్కడ చదరంగాలకీ, పేకాటలకీ, కీచులాటలకీ ఆస్కారం ఉండదు." అన్నారు శంకరయ్యగారు.

కరణంగారు చిన్న అడ్డుపుల్ల వేశారు. కడసారి ప్రయత్నంగా. "స్వామీ, మీరు పూర్వాశ్రమంలో ఈ గ్రామానికి డబ్బు ఇచ్చారు. సన్యాసాశ్రమ స్వీకరణతో, ధర్మశాస్త్రరీత్యా తాము మృతతుల్యులు. అందువల్ల ఈ సొమ్ముని అన్యథా వినియో

గించాలని తమరు ఆదేశించడం ధర్మవిరుద్ధం అవుతుంది. మేము రామ మందిరమే నిర్మిస్తాం. అదే ప్రజల అభిమతం కూడా. తాము కాదనరాదు" అన్నారు.

కంట్రాక్టరు అందుకోవారు హఠాత్తుగా "సూరయ్యగారికీ జై" అన్నారు.

జనం ఎవరూ ఉలకలేదు పలకలేదు.

"మీకు రామాలయం వద్దా" అని గద్దించాడు సూరయ్యగారు.

స్వాములవారు మందహాసం చేశారు. "ఎందుకు వద్దండీ రామాలయం? ఎవరు వద్దంటారు? దానికోసం స్పర్థలు వద్దంటారు. ఇప్పుడు ఈ ఊరికి బడి అవసరం. కాబట్టి బడి కట్టించడం మంచిది. అందులోనే రాముడికి ఓ మందిరం ఏర్పాటు చేయండి. బడే ఒక గొప్ప గుడి. ఆ గుడికి ఇవాళ మీరంతా వెళ్లితే, మీ పిల్లల్ని పంపితే, మీకు మంచిదారి కనపడుతుంది. మీరు కోరే వరాలన్నీ ఆ దారినే వెళ్లితే దేవుడు ఇస్తాడు. కరణంగారు ధర్మశాస్త్రం చెప్పారు. దాని ప్రకారం నాకు ఉత్తరువులు ఇచ్చే హక్కు లేదు. అయితే మీ మంచి కోరేవాడిగా నేను మిమల్ని అడుగుతున్నాను. బడి కట్టించి, అందులో రాముడి బొమ్మ పెట్టి, అదే గుడి అదే బడిగా దాన్ని మీరు గౌరవించి తరించలేరా?"

"రామనాథంగారికీ జై" అన్నాడు వీర్రాజు - స్వాములవారి పూర్వాశ్రమ నామధేయం అలవాటైనందువల్ల. జనం జయధ్వానాలుచేసి స్వాములవారికి ప్రణామాలు ఆచరించారు.

సూరయ్య, కంట్రాక్టరు, సుబ్బిసెట్టి కొరకొర మాశారు. సూరయ్యకు మతి బొత్తిగా పోయింది. కంట్రాక్టరుకీ, సెట్టికీ, నల్లమంగునాశికీ ఇచ్చుకోవలసిన బాకీసమస్య మళ్లీ వెక్కిరించింది. ముఖాన కత్తివాటేసినా నెత్తురుచుక్క రాలే ఆస్కారం లేకుండా పోయింది. ఈ సంగతి గ్రహించే, కంట్రాక్టరు సూరయ్యముఖాన కత్తివాటు వెయ్యలేదు. రామమందిరం పేరుచెప్పి సంపాదిద్దా మనుకున్న రెండువేలపై చిలుకూ దక్కకుండా పోయినందుకు ఏడుపు వచ్చింది. అయినా తుది ప్రయత్నం చేశాడు. 'కొత్తబడి కట్టించే కంట్రాక్టు నాకు ప్రసాదించాలి స్వామీజీ!' అన్నాడు చేతులు జోడించి భక్తిప్రపత్తులు వెదచల్లుతూ. స్వామిజీ మందహాసం చేశారు. "బడికట్టడానికి ఊళ్లోజనం అంతా శ్రమదానం చేస్తారు. నీకు అభిమానం ఉంటే సలహాలు ఇచ్చి తోడ్పడు. బడి కట్టడం ఒకటేకాదు.

# ఇద్దరమ్మాయిలూ - ముగ్గురబ్బాయిలూ

కాంట్లోనే ఉపకారాలూ అవీ కావాల్సి ఉంటుంది." అన్నారు.

* * *

తదుపరి! కంచికి బయలు దేరినకథ మధ్యలో తప్పుదారినపడి, తిరిగి హఠాత్తుగా అడ్డం తిరిగి కంచికి అభిముఖంగా బయలు దేరింది.

స్వాములవారు సందేశం ఇవ్వగానే ప్రయాణం అయ్యారు. ఎందరు ప్రతిమాలినా ఆఊళ్ళో భిక్ష స్వీకరించ నిరాకరించారు.

సుబ్బిసెట్టి, కంట్రాక్టరూ, గవరయ్యగారూ సూరయ్యని చాటుకి పిలిచి అతన్ని అతని దురదృష్టాన్ని, విడివిడిగానూ, జంటగానూ, దుయ్యబట్టి, వారం తిరిగేలోగా బాకీలు చెల్లగట్టకపోతే నడివీధికి లాగుతామని హెచ్చరించి, కొలువుగట్టునించే పడవెక్కి పట్నం వెళ్లిపోయారు.

సూరయ్యగారు తలవంచుకుని విచారపడుతూ కొంపకి బయల్దేరాడు. కరణంగారు వెంటపడ్డాడు. సూరయ్య ఎన్నికలలో గెలవడం ఓడడంతో ఆయనకు పనిలేదు. ఓట్లు ఇప్పించేవరకే. ఒప్పందం ప్రకారం సూరయ్యగారు ఇవాళ సాయంకాలం తన కొడుకు చి॥ రామారావుకి కరణంగారి కూతురు చి॥ సౌ॥ సీతాలక్ష్మిని ఇచ్చి పెళ్లి చేయించడానికి తాంబూలాలు ఇప్పించాలి.

కరణంగారు వెంటపడగానే సూరయ్యగారు మండిపడ్డాడు. "పోవయ్యా పరువు పోయి, నే నేడుస్తుంటే పెళ్లంటావు." అన్నాడు చిరాకుగా. కరణంగారికి కోపం రాదు. వస్తే కత్తు వస్తుంది. అదొచ్చినా ఇదొచ్చినా ఆయన మనిషి కాడు. ఆ సంగతే కరణంగారు గట్టిగా చెప్పి 'జాగ్రత్త!' అనడంతో సూరయ్యగారు సరే ననేశాడు—కట్నంలో అడ్వాన్సుగా రెండువందలు తీసుకుని బస్తీలో బాకీలు చెల్లగొట్టొచ్చునన్న ఊహతో.

దగ్గిరుండి సూరయ్యగారినీ, పెళ్లికొడుకు రామారావుని ఇంటికి తీసుకెళ్లే ఉద్దేశ్యంతో 'పదండి ముందు మీ యింటికెళ్లి సూరమ్మగారికి చెబుదాం...అడుగో అబ్బాయి...రా! రామారావూ! రావోయ్' అన్నాడు కరణంగారు.

కొంచెం అవతలగా పోతున్న రామారావూ వీర్రాజూ దగ్గరికొచ్చారు. కరణంగారు రామారావు చెయ్యి పట్టుకున్నారు ఆప్యాయంగా. వీర్రాజు గబగబ ఆలోచించాడు, కర్తవ్యం ఏమిటా అని. అరనిముషంలో స్వంతంగా ఓ ప్లాను వేసుకున్నాడు: ఇప్పుడది రామారావుకి వెంటనే చెప్పెయ్యాలి. కరణంగారూ సూరయ్యగారూ పక్కనే ఉన్నారు యమదూతల్లా. ఎలా?

పూర్వం తెలుగుదేశంలో 'క' భాష, 'గా' భాష, 'లత్రక్కింకుల పాఠి' (అంటే తలక్రిందుల భాష) అని కొన్ని భాషలు అమలులో ఉండేవి. వీటిని కనిపెట్టినవారూ బహుళవ్యాప్తిలోకి తెచ్చినవారూ పిల్లలూ, ఆడపిల్లలూను. 'గా' భాష తెలుగు పాఠశాలల ఆస్థాన భాషగా, ఫాషన్‌గా, చూడామణి అయిన రోజుల్లోనే వీర్రాజు 'గా' భాషని క్షుణ్ణంగా అవగతం చేసుకున్నాడు. ధారాళంగా మాట్లాడే నేర్పు సంపాదించాడు. రామారావుకి 'గా' భాష బాగానే అర్థం అయిపోతుంది కాని మాట్లాడ్డం బాగా రాదు. 'గర' భాష అని ఇంకో భాష ఉంది. చిన్నపిల్లలూ, ఆడపిల్లలూ, పరిమిత మేధస్సంపన్నులూ దాన్ని వాడుతారు. పాత భాష అయినా ఈ ఆపత్కాలంలో అదే ఆదుకుంది. విద్య విదేశబంధువన్నారు.

కరణంగారి చెయ్యి పట్టుకు నడుస్తూన్న రామారావుకి, అతని పక్క నడుస్తూన్న వీర్రాజు ఈ క్రింది సందేశం ఇచ్చాడు.

"వెగధగ వాగాయా! సీగీ తగ వాగా కుగు రాగాసి గినగ ఉగుత్తగరగం ఇగిందు. అగందుకుగో" అంటే 'వెధవాయా సీత నాకు రాసిన ఉత్తరం ఇదుగో అందుకో.' పగముగయగం చుగూసిగి నగలుగురిగి ముగుందగరగ పెగట్టగేయ్ (సమయం చూసి నలుగురి ముందరా పెట్టేయ్")

రామారావు సందేశం బోధపరచుకుని గుట్టుగా వీర్రాజు అందిచ్చిన ఉత్తరం తీసుకుని జేబులో పెట్టుకున్నాడు. వీర్రాజుకి సీత రాసిన ఉత్తరం అది. రెండు క్షణాలలో రామారావుకీ ఒక ఊహ తోచింది. తనకు ప్రావీణ్యత ఉన్న 'గర' భాషలో వీర్రాజుకి ఈ క్రింది సందేశం ఇచ్చాడు.

"ఒగా రోగాకేయ్ రగరాజా! నుగురు గువ్వు పగరరిగెట్టుకుని మిగిరిమీ ఇగిరింటికి వెగిళ్లి మిగిరిమీ అగరమ్మని బగరబామ్మనీ మగర మా ఇగిరింటికి తిగిరి తీసుకురా (ఒరేయ్ రాజా నువ్వు పరిగెట్టుకుని మీ ఇంటికి వెళ్ళి మీ అమ్మనీ బామ్మనీ తీసుకురా.)

'సైకో' అని తుర్రుమన్నాడు వీర్రాజు.

"ఏమిట్రా ఆ గొణుగుడు" అని గద్దించాడు సూరయ్యగారు.

"ఏదో వెర్రాళ్లు. కబుర్లు పోనిస్తురు" అన్నాడు కరణంగారు.

ఇల్లు చేరీచేరగానే "ఇప్పుడే వస్తానండి" అంటూ పరుగెత్తాడు రామారావు. పక్కవీధిలో ఉన్న జగన్నాథంగారింటికి సరాసరి వెళ్లాడు. సావిట్లో ఉయ్యాలబల్లమీద కూర్చుని తల దువ్వుకుంటూంది సుబ్బలక్ష్మి. రామారావుని చూడగానే చెంగున లేచి స్తంభంచాటుకి వెళ్లి నించుంది. రామారావుకి ఈసారి ఎక్కడలేని ధైర్యం వచ్చేసింది. "మీ నాన్నగారున్నారా?" అని అడిగేశాడు.

"ఉన్నారు" అంది సుబ్బులు తలవంచుకొని. "పిలుస్తా" అంది లోపలికి బయల్దేరుతూ.

రామారావు ఇటూ అటూ చూశాడు. "ఏయ్! సుబ్బులూ!" అన్నాడు మెల్లిగా.

సుబ్బులు తపీమని ఆగిపోయి మెల్లిగా వెనక్కి తిరిగిచూసింది.

రామారావు గుటక మింగాడు.

రామారావుకి స్పృహ వచ్చేసరికి "ఏం? రామం?" అన్నారు జగన్నాథంగారు

"ఏం లేదండి. మీరు మా యింటికి అర్జంటుగా రావాలి. మా మావయ్య నాకు అన్యాయం చేసేస్తున్నాడు......సీతని, నాకు......రండి...... ఏమనుకోకండి" అన్నాడు.

"అబ్బే. అనుకోడాని కేంముందోయ్.... కాని చూడు."

"మీరు సందేహించకండి......రండి చెబుతా" అని చెయ్యి పట్టుకున్నాడు రామారావు.

జగన్నాథంగారిని వెంటపెట్టుకొని రామారావు గుమ్మంలో అడుగుపెట్టేసరికి సూరయ్యగారు కరణంగారు మండిపడిపోతున్నారు జమిలిగా. జగన్నాథంగారిని చూసి కొంచెం తగ్గారు. ఇంతలో వీర్రాజూ వాళ్ళమ్మనీ, బామ్మనీ వెంటపెట్టుకుని వచ్చేశాడు. సూరమ్మగారు చాప వేసి మర్యాద చేసింది. రామారావుకీ వీర్రాజుకీ తప్ప ఇంకెవ్వరికీ ఇదంతా ఏమిటో అంతు చిక్కలేదు. ఒక అరనిముషం నిశ్శబ్దం ప్రవర్తిల్లింది.

కరణంగారు గొంతు సవరించుకున్నారు. "సూరయ్యగారు, మనం లేద్దామా మరి? వేళయింది" అన్నారు.

"ఆఁ. ఆఁ. పదండి...రారా. రాంబుడు"



"పొదవె సంజను వార్షుకాంబుదము హొయలు."

—డి. వెంకటేశ్వరరావు, ఏలూరు

అన్నాడు సూరయ్యగారు వ్యవహారించినట్టుగా.

'ఎక్కడికి' అన్నాడు రామారావు.

"కరణంగారి ఇంటికిరా. తాంబూలాలు పుచ్చుకోడానికి ... ముహూర్తం పెట్టించడానికీ అనుకో" అన్నాడు సూరయ్యగారు అదరంగా.

"ఎందుకూ?" అన్నాడు రామారావు వింతగానిలా.

"ఎందుకేమిట్రా. సీతని చేసుకోడానికి"

"ఎవరు? నేనా?"

"అవ్వ. నేను" అన్నాడు సూరయ్యగారు చిరాకుపడి.

"ఓ. అలాగా!" అన్నాడు రామారావు వాళ్ళమ్మ వంక చూసి. సూరమ్మగారు కొప్పడింది. "నీకు మరీ వెర్రిచేష్టలు ఎక్కువవుతున్నాయేమిట్రా!" అందావిడ.

రామారావు విజృంభించాడు. "ఏమిటమ్మా ఆమాటలు. రాజు సీతని చేసుకోవాలనుకుంటూఉంటే నేనలా చేసుకోనీ! వాడూ నేనూ అన్నదమ్ముల్లాగా కల్సిమెలసి పెరగలేదా?" అన్నాడు.

కరణంగారు గయ్యిమన్నాడు "రాజుకి చేసుకోవాలనుంటే నాకివ్వాలని ఉండొద్దా, సీతకి ఇష్టం ఉండొద్దా?"

పిర్రాజు తల్లికి అభిమానం వేసుకొచ్చింది. "బాబూ కరణంగారూ. మేం మిమ్మల్నేమీ అడగలేదుగా, మా పిల్లని ఇస్తారా అని? అమ్మరాని మాటలు పట్టుకుని ఎందుకలా విసుక్కుంటారూ?... ఏంరా రాజూ! ఇందుకా మమ్మల్ని ఇక్కడికి తీసుకొచ్చావు?... ఏమిటీ గోల?" అంది.

"పిన్నిగారూ! మీరు కోప్పడకండి" అంటూ జేబులోంచి ఉత్తరం తీశాడు రామారావు. "రాజు సీతని చేసుకోవాలని ఉబలాటపడుతున్నాడు. ఎదటే ఉన్నాడు. కావాలంటే అడగండి. ఇంక సీతకి కూడా పెంకే తగని అభిమానం అందుకు ఇదే నిదర్శనం. ఇక్కడ పరాయివాళ్లెవరూ లేరు కాబట్టి చూపిస్తున్నా. ఇదుగో ఇది సీత

# ఇద్దరమ్మాయిలా - ముగ్గురబ్బాయిలా

రాజుకి రాసిన ఉత్తరం, ఏవమ్మా ఇవన్నీ చూసి, రాజు నా అన్నతమ్ముడింటివాడని ఎరిగుండీ నేను సీతని చేసుకోవాలని ఇంకా పట్టుపడతావా అమ్మా... పైగా నాకు ఆ పిల్ల అంటే ఇష్టంలేదు. మన స్తత్వాలు కలవవు...అయ్యా కరణంగారూ కోప్పడకండి. ఉన్నమాట ఇప్పుడే చెప్పాను. ముసుగులో గుద్దులాటలు నాకు నచ్చవు...ఏం అమ్మా.. ఇంకా తాంబూలాలు పుచ్చుకోవాలంటారా?" అన్నాడు ధీమాగా.

సూరమ్మగారు నవ్వుతూ, అంది. "అయినా నీ కిష్టంలేకపోతే నే నెందుకు బలవంతం చేస్తానురా...నీకు నచ్చిందాన్నే చేసుకో."

కరణంగారు చురుకుగా ఆలోచించాడు. వీర్రాజు హూటికీ, కులానికీ కూడా పేదకాడు. తండ్రి లేడు. బాగానే ఉంటాడు. ఇంతో అంతో చదువుంది. ఎటొచ్చీ ఒక్కటే లోపం. రామారావుకన్న తెలివైనవాడు. లౌక్యం బాగా తెలుసు. పైగా సీత రాసిన ఉత్తరం ఇక్కడివాళ్ళే కాక, పైవాడు జగన్నాథానికి తెలిసిపోయింది ఇది బయటపడితే పిల్లకి పెళ్ళవడం కష్టంకూడా. పట్టు సడలకుండానే, కట్నం పెరగకుండానే కరిణీకం చెయ్యాలి.

"అయితే ఇంకేం! నా కూతురికి రాజు నచ్చి, వాడికి అది నచ్చితే ఇంక అడ్డేమిటి? ...ఇప్పుడే తాంబూలాలు ఇచ్చుకుందాం. ...ఏమంటారు అక్కగారూ?" అన్నాడు వీర్రాజు తల్లివంక తిరిగి. ఆవిడ ఇలా అవుతుందని ఎన్నడూ అనుకోలేదు.

"పిల్లాడి సుఖంకన్న మీ క్కావలసిం దేమిటి పిన్నీ" అని రామారావు చిన్నపాడి చేశాడు.

"ఔను అక్కగారూ, ఊ అనండి" అంది సూరమ్మగారు.

"శుభస్య శీఘ్రం" అన్నాడు ఇప్పటికి తేరుకుని సంగతి సందర్భాలు బోధపరచుకున్న జగన్నాథంగారు.

"తథాస్తు" అన్నాడు రామారావు మావయ్య. ఏడవాలో నవ్వాలో ఇదమిత్థంగా నిర్ధారణ చేసుకోకుండానే

"సరే...మీరంతా ఇంత ఇదిగా మా మేలుకోరి చెబుతూ ఉంటే నేను కాదంటానా...ఏమంటారు అత్తయ్యా?" అంది వీర్రాజు తల్లి.

"మరేనమ్మ మరే" అంది వీర్రాజు బామ్మగారు.

"రైటో రైటో" అనేశాడు వీర్రాజు అలవాటుకొద్దీ. వెంటనే రామారావు ఇంగ్లీషులో మాట్లాడేసి, ఇంగ్లీషులో నవ్వేసి రాజు వెకిలిచేష్ట కప్పిపుచ్చాడు...అంతా ఆనందంగా నవ్వారు.

అమాంతంగా నిశ్శబ్దం ఏర్పడింది. ఎవరికేలా మాట్లాడాలో తోచలేదు—ఏం మాట్లాడబడాలో తెలిసినా.

కరణంగారే మళ్లా కొంచెం దగ్గి గొంతు సవరించుకున్నాడు. ఊఁ అన్నాడు. "చెప్పవయ్యా పెళ్లికొడకా...నీకు నచ్చిన పిల్ల ఎవరేనాఉంటే ఇప్పుడే చెప్పెయ్." అన్నాడు.

సూరయ్యగారు మందహాసం చేశాడు ఓడిపోయిన ఛాంపియన్‌లాగ.

రామారావు వాళ్లమ్మవంక చూశాడు పరీక్షగా. ఆ తరవాత జగన్నాథంగారివేపు చూశాడు. తలవంచుకున్నాడు. "సుబ్బులు" అన్నాడు మృదువుగా.

జగన్నాథంగారు త్రుళ్లిపడి తక్షణం తమాయించుకుని "అంతకన్న నాకొక్కవలసిందేముంది నాయనా! సూరమ్మగారు నాపిల్లని కడుపులో పెట్టుకుంటానంటే కాదంటానా. సందేహించేది ఇంకా ఆవిడే కావాలి గాని" అన్నాడు.

సూరమ్మగారు రామారావు వంక చూసింది. విప్పారిన కళ్ళతో ఆశగా చూస్తున్నాడు. ఆవిడలో వాత్సల్యం పొంగింది. కంటనీరు తిరిగింది. "వాడి ఇష్టానికికే నేనెప్పుడూ అడ్డుచెప్పను... సుబ్బులు బంగారుతల్లి. మాలక్ష్మి" అంది నెమ్మదిగా.

"ఇంకేం పనిలోపని ఈజంటకీ ఇవాళే తాంబూలాలు ఇచ్చుకోవడం మంచిది. శుభస్య శీఘ్రం" అన్నాడు కరణంగారు.

"తథాస్తు" అన్నారు గుమ్మందాటి అప్పుడే సావిట్లో కాలుపెట్టిన బడిపంతులు శంకరయ్యగారు' 

(అయిపోయింది)

# బరువు బ్రతుకులు

'కేసరి'

వళ్లా ఒకమారు ముంగున్న అద్దాన్ని పమిటకొంగుతో తుడిచి విశాలమ్మ తనముఖాన్నందులో చూచుకుంది. జుట్టులో వెండితీగల్లా మెరుస్తూన్న నాలుగైదు వెంట్రుకలు కన్పించాయి. నీరసంగా నవ్వుకుంది, పండ్లు విరిగిన దువ్వెనతో వెంట్రుకల్ని సర్దుకుంటూ! కండ్లక్రింద వల్లనినీడలు, ముఖాన అప్పుడప్పుడే కన్పిస్తూన్న ముడుతలూ, తన నిస్సారమైపోయిన బ్రతుకుకు నిదర్శనలుగా కనిపిస్తున్నాయి..

...ఆ తొలిరోజుల ఉత్సాహం, ముద్దులూ ముచ్చటలూ, అన్నీ కలలలోని అనుభవాల్లాగా తోచినాయి. ఈనాడు ఈ సంసారశకటం లాగడానికి భారమైన రాళ్లబండిగా తయారైంది...తనది, 'ఆయనది' అరంలేని నిస్సారమైన బరువు బ్రతుకులు... జీవితం, నిస్పృహతో, నిట్టూర్పులతో, నిరాశతో నిండిపోయింది. జీవించడం ఒక ధర్మం, కుటుంబాన్ని నిలబెట్టడం ఒకవిధి అయిపోయింది ... సంసారనాటకం సాగుతూనేవుంది. తనూ, ఆయనా తమతమ పాత్రలను పోషిస్తూనే వున్నారు, యెటువంటిలోపమూ రాకుండా ! ... కానీ ఆ పాత్రలలో జీవం లేదు - అలవాటును తీర్చుకోడంలోని సంతృప్తిమాత్రమే మిగిలిందందులో...

...ఆ కాలంలో అపురూపంగా తాను స్కూలుఫైనలుదాకా చదువుకుంది. క్రొత్తల్లో, తాను తీరికసమయాల్లో చదువుకోడానికని తెలుగుపత్రిక తెప్పించేవాడాయన. ఈనాడూ వస్తూనేవుందది రోజూ, ...సుశికోసం! ...తనకు పత్రికలు చదవడం ఒకటా?....

సుశి చిన్నప్పుడంటూండేది, 'నీగొంతు బలేగా వుంటుందమ్మా'ని. సుశి యిపుడు సంగీతం నేర్చుకుంటూంది ... వీణ నేర్చుకోవాలని యెంత సంబరపడ్తూంది?...కాని యీ దురదృష్టవంతులయింటపుట్టింది!....... తానూ సంగీతసాధన చేసింది పసితనంలో! ...కానీ తాను గొంతెత్తిపాడి యెన్నియుగాలైంది? పాటలొకటి కొరవ, బ్రతుకే యెడతెగని విషాదగీతంగా తయారైనపిమ్మట!...

ఆరోజు...సుశి థర్డుఫారంపాసైందని తెలీగానే చదువుకున్నతనే అనింది, "ఏమమ్మా, సుశీ! నే చదువుకొని యేం వెలగబెడ్తున్నా చెప్పు! ఆడదాని చదువంతా వంటయింటి పొగలోకలిసిపోవలసిందేగా?"అని. 'ఆయన' కూడా వున్నారు వింటూనే. కానీ డిప్లమాటిక్ గా పలుకూవులుకూ లేకుండావున్నారు. అబ్బాయి - విన్నట్లుంది నేనన్న మాటలు - గదిలోంచి వచ్చి "ఐతేమ్మా! నేనూ చదువు మానుకుంటాను, ఎంత కాలేజీచదువులు చదివినా గుమాస్తా పనికేగా" అని తలవంచుకున్న నాన్నతట్టు చురుగ్గా చూచాడు.... ఏవిధంగానో, తనవల్ల, ఆయన పట్టుదలవల్లా కానున్నా, అబ్బాయి గట్టి పట్టుదలవల్లైనా, అమ్మాయికూడా ఎస్. ఎస్. ఎల్. సి. గట్టెక్కింది. అంతకు పిమ్మట వాడు

యెదిరించాడు బెదిరించాడు కానీ అమ్మాయి చదువు అంతటితో నిలిచిపోయింది. ఇప్పటికీ వాడు వీలు చిక్కినప్పుడల్లా దెప్పిపొడుస్తుంటాడు బల్లెల్లాంటి మాటల్తో! కాని యిద్దర్నీ కాలేజీలో చేర్పి నెగ్గడం అంటే మాటలా? అబ్బాయి జీతాలు కట్టడానికే తల ప్రాణం తోకకొస్తూందాయె!"

కానీ సుశి మాత్రం యెంతగానో కించపడ్తుంది, తనతోటి వాండ్లందరూ కాలేజీల్లో చేరి చదువుతూంటే, తానింట్లో గోళ్లు గిల్లుకుంటూన్నానే అని. అందులోనూ ఎస్సెస్సెల్సీలో అంత మంచిమార్కులొచ్చాయి! ...ఏంచేస్తాం?......అమ్మాయిని నిజంగా అన్యాయమే చేస్తున్నాం...... ఇటు,

యీ డున పెండ్లైనా చేసేస్తే అదోరకం లేదా పై చదువులకన్నా పంపాల్సింది - గెంటికి నోచుకోలేక దాని వయసు వలా అడవి కాచిన వెన్నెల చేస్తూన్నాం......
ఆపిల్ల అడిగిన నిటంగు వస్త్రువులన్నా తీసియ్యారాయన! ప్రతిరోజూ అడిగడిగి, ఆపిల్ల అలకలు సాగించడమే!...తలవూపడం తప్ప చెప్పినపని చేయడాయె......వారం రోజులుగా చంటిబిడ్డకు హార్లిక్సు నిండుకుందని ప్రతిరోజూ జ్ఞాపకం చేయడమే కానీ హార్లిక్సేమో యింటికి రాకపోయె! ఈరోజైనా తెస్తేగాని పిల్లవాడు బ్రతకనిచ్చేట్టు లేదు!

వెంటనే మధు జ్ఞాపకంవచ్చాడు. చాలా సేపట్నుంచీ వాడి అలికిడే లేదు... తొట్రుపాటుతో వాకిట్లోకి వచ్చి 'మధూ' అంటూ పిలవబోయింది. కానీ యింతలో మధు కనిపించాడు - సగంకటి వదిలిన కాంపౌండు గోడనెక్కి, ప్రక్కింటి యింజినీరుగారబ్బాయి టాయ్ మోటారు త్రొక్కుతూంటే రెప్పార్పకుండా చూస్తూన్నాడు ...టాయ్ మోటారు నిజంగానే యెంతో ముచ్చటవేస్తూంది. స్టీరింగ్ వీల్, హార్న్, హెడ్ లైట్లు, అన్నీ నిజమైన కారుకున్నట్లే వున్నాయి ... మెల్లగా అడుగుల్లో అడుగులు వేసుకుంటూ తానుకూడా మధు వెనక్కుపోయి నిలుచుకుంది. తన అలికిడి కూడా మధు చెవిలో పడినట్టు లేదు. పాపం, ఆ పసిహృదయం, ఆ టాయ్ కారును ఎంతగా కోరుతూందో మరి! ... తన అసమర్థతకు, దారిద్ర్యానికి ఆ తల్లిహృదయం తల్లడిల్లింది. ముప్పయ్యో, వలభయ్యో పెట్టి ఆ కారు కొనగలగడం యీ జన్మలో సాధ్యం కాదు. ఆ పసికందు అమాయకపు తొలికోర్కెలు గుండెల్లో అణగారిపోవలసిందే! ... ఈ వయసులోనే వాడికి నిరాశ, చితికిన కోరికలూ నిత్యానుభవాలు కావలసిందే!...ఆ తల్లిహృదయంలో వేయియీటెలు పొడుచుకున్నట్లై కన్నీటి కెరటాలు పొరలినాయి...

'అమ్మా' అంటూ ఉత్సాహంతో మధు వెనక్కుతిరిగి అమ్మ ముఖంకేసి చూచాడు. కన్నీటిబొట్లు తనముఖంమీద వేడిగా రాలినాయి...మధు ముఖం చిన్నబుచ్చుకొని, పైకుబుకుతూన్న నిట్టూర్పును దిగమ్రింగాడు. విశాలమ్మ మధువును పొదివియెత్తుకొని కుములుతూన్న గుండెలకు హత్తుకుంది, కన్నీటిని తుడుచుకుంటూ!...

* * *

ఆఫీసునుంచి వచ్చి, స్నానం చేసి, మళ్ళా యెడతెగని ఆ కాగితాలు ముందరేసుకొని కూర్చున్నారాయన. వంటపని కాస్తా తెముల్చుకొని, విశాలమ్మ తానుకూడా వసారాలో చతికిలబడింది. టేబిల్ లైట్ నీడలో 'ఆయన' ముఖం కన్పిస్తూంది...విశాలమ్మ మళ్ళా ఆలోచనాప్రపంచంలో పడింది....

ఇరవై సంవత్సరాలకు పూర్వం, తాను తొలిసారిగా చూచిన మూర్తియేనా యీయన!...ఆరోజుల్లో వుండిన చిలిపితనం, చురుకుదనం యేమైనా యిప్పుడు?... కాలం, జీవితంలోని వడిదుడుకులు, మనిషిలో ఎన్నిమార్పులు తెస్తాయి!...

ఆ కాలంలో, ఆయన తనకు కావలసినవాండ్లూ, తలిదండ్రులూ, యెంత వారించినా కాదని, తన్ను కట్నాల్లేకుండానే వివాహం చేసికొన్నారు. ఆరోజుల్లో ఆయన ఆదర్శాల మహోన్నత శిఖరాలను తానందుకోలేకపోయేది, ఆయన భావ వైశాల్యాన్ని వూహింపలేక ఆశ్చర్యపడేది...

కానీ యిప్పుడో ఆయన తన ఆదర్శాల కోసం పోరాడేందుకు తీరికేది?, దినం గడవడమే ఒక మహా సమస్యగా తయారైన పిమ్మట!.

అప్పుడాయనకు కవిత్వపు పిచ్చికూడా వుండేది...కథలూ, గేయాలూ పత్రికలకు పంపిస్తూండేవారు...అవి పత్రికల్లో ప్రకటించగానే, తనకు తీసికొచ్చి చూపిస్తూ యెంతగా మురుసుకొనేవారు!... ఆయన స్నేహితులాయన్ను పొగుడ్తూండేటప్పుడూ, అభినందన లేఖలు వ్రాసినప్పుడు తానెంత ఉప్పొంగిపోయేది?... తన స్నేహితురాండ్రంతా కూడా తన్ను వూరించేవాళ్లు - "నీకేమే, విశాలం!... కవిని, రచయితను కొంగులో కట్టేసుకున్నావ్! ప్రతికథలో, ప్రతిగేయంలోనూ నీవే సాక్షాత్కరిస్తూంటావు" అని.

కానీ జీవితంలోని కర్కశ సత్యాలు, ఆయనలోని కవిత్వాన్ని చంపేసినాయ్. ఆయన మనసు మొద్దుబారిపోయింది. ఆయన వూహాల రెక్కలు రాలిపోయినాయి. నిత్యజీవితంలోని నిర్జీవమైన కార్యక్రమం ఆయనలోని దృష్టిని పరిమితం చేసింది. ఉత్సాహాన్ని ఆర్పేసింది. తనలాగే ఆయనకూడా గడియారంలా దినాలు గడుపుతున్నారు.

ఈమధ్య ఆయనముఖాన చిరునవ్వు చూచి యెన్నిరోజులైంది? ... తానైనా ఆయన్తో సంతోషంగా మాటలాడ్డానికైనా వోపికుంటేగా?... ఎపుడన్నా మాట్లాడాల్సివచ్చినా—

'ఏమండీ! — అబ్బాయికి కాలేజీఫీజు కట్టాలటగా?'

"అమ్మాయి సంగీతంమాష్టారు నెలజీతం యిస్తారా?" ఇలాంటిమాటలే....

మొన్న ఆయన స్నేహితుడు, అబ్బాయి, యింగ్లీషు లెక్చరరట, యింటికొచ్చి, ఆయన్తో మాట్లాడ్తూ "ఏ హెూయ్! మూర్తీ, మీ అబ్బాయి నీకు తగ్గవాడనిపించుకుంటున్నాడోయ్! మొన్న యింగ్లీషు డిబేటులో మీవాడిదే మొదటిచేయి. వాడి వాగ్ధాటి, వాడిభావాలూ వింటూంటే వెంటనే నీవు జ్ఞాపకంవచ్చావంటే నమ్ము!... గేయాలూ అవికూడా వ్రాస్తాడటగా! ఏం చక్కని గొంతురా వాడికి, నిన్న తెలుగుసమితిలో పాడ్తూంటే, ఆడియన్సంతా చెవులు రిక్కించుకున్నారు ... మొత్తానికి మీరు అదృష్టవంతులోయ్....!"అన్నప్పుడు ఆయన మొగమింత చేసుకొని వుప్పొంగిపోయారు.... ఈ చీకటిబ్రతుకుల్లో ఆ పిల్లలే వెలుగు దీపాలు!...

సరే యిక అమ్మాయివిషయం తలుచుకుంటేనే గుండె బావురుమంటుంది. ఈడుకొచ్చినపిల్లను యెంతకాలమని యింట్లో వుంచుకుంటాము? ... అట్లని వేలకువేలు కట్నాలెక్కడ కుమ్మరించగలం? ... ఆయ

# ★ బరువు బ్రతుకులు ★

వతో అమ్మాయి పెండ్లివిషయం ప్రస్తావించడానికైనా భయంగావుందాయె!... మొన్న యెవరో ఆయనతో మాటవరసకంటే "డబ్బుకు అమ్ముడుపోయే ఆత్మగౌరవహీనుడికి నా సుశీ నివ్వలేను! సుశీ అవివాహితగానైనా వుండడమే యెంతో మేలు, మొగుణ్ణి కొని తెచ్చుకునేకంటే!" అన్నారు ... ఇంతకీ ఆపిల్లనొక యింటిదాన్నిగా యెప్పుడు చేయగలుతామో మరి!

ఇంతలోనే నిదురబోతూండిన పసివాడు లేచి కూనిరాగాలుతీయడం మొదలెట్టాడు. మధుకూడా ఆకలని మారాం ప్రారంభించాడు. చంటివాడికి ఆవుపాలు త్రాగించి, మధుకు అన్నంపెట్టి విశాలమ్మ మళ్ళా వసారా చేరింది - అబ్బాయీ, సుశీలల కోసం యెదురుచూస్తూ.

మధు ఏదో బొమ్మలపుస్తకం పేజీలు తిరగవేస్తూవున్నవాడల్లావది లేసి విశాలమ్మ ఒడిలోకి చేరి గారాబాలుపడుతూ, "అమ్మోయ్!..మరి ...నాకో మోటారుకారొద్దు లేమ్మ..... మరి నీవు సాయిత్రం యేడిచావుగా! నీవేడిస్తే అది నాకొద్దు లేమ్మ!..." అన్నాడు ముద్దుమాటల్తో. విశాలమ్మ హృదయం ఒక తీయని బాధతో నిండిపోయింది. ఆమె కన్నులు - ఆనందబాష్పాలతోనో, దుఃఖాశ్రువులతోనో నిండిపోయినాయి. మధుని జవిరితీసికొని "నా బుజ్జితండ్రి! నా బంగారు మధు! ఆ మోటారు నీకు తప్పక తీసిస్తా..." అంటూ లేబుగ్గలను మరిమరీ ముద్దులాడింది...ఆయన పేనా కింద పెట్టేసి తమవైపే చూస్తూండడం గమనించింది విశాలమ్మ. ఆయన కంటి కొలకుల్లో ఆణిముత్యాల్లా కన్నీటిబొట్లు మెరుస్తూండడం కూడా చూచింది. బరువుగా నిట్టూర్చి తలవంచుకొని వ్రాసికోడం ప్రారంభించాడాయన మళ్లా!

సుశీ సంగీతపాఠశాలనుండి వచ్చింది. రావడం రావడం అమ్మ ప్రక్కన చేరి - "అమ్మోయ్.....రేపట్నించి సంగీతం స్కూలుకు నేను పోనే" అంది. విశాలమ్మా, ఆయన యిద్దరూ ఆశ్చర్యపడ్డారు - యేం జరిగిందో తెలీక!

"ఏమిటి చిట్టీ! ఆవిడ జీతం గీతం అడిగిందేమిటి...అయినా యింకా మొదటి తారీఖైనా రాలేదుగా?...ఎందుకు పోవమ్మ అక్కడికి...?" అడిగింది విశాలమ్మ.

"అది కాదేమ్మ! మరి నీకేమో బాగా సంగీతం వచ్చుగా...నీదగ్గరే నేర్చుకుంటా లేవే రోజూ! నెల నెలా ఆవిడకెందుకు పది రూపాయలు!" అంది సుశీ.

విశాలమ్మ మొగం వెల వెల బోయింది. ఆయన మొగం సంతోషంతో జేవురించడం గమనించి, తెచ్చిపెట్టుకున్న వుత్సాహంతో

"సరేలే తల్లీ! నా చదువు సంగీతం - మరెందుకూ వుపయోగించలా, నీకైనా పనికి రానీ! ... నెలకు పదిరూపాయలా మెకిచ్చుకోలేక సతిమతమౌతున్నాం!" అంది.

"శబాష్ విశాలం!" అన్నాడాయన జారిపోతూన్న చత్వారపు అద్దాలను సర్దుకుంటూ!

అబ్బాయొచ్చాడు! ఎంతసేపైందో కానీ, వాకిట్లోనే నిల్చొని లోపల జరుగుతూన్న జీవితనాటకాన్ని పరికిస్తూన్నాడు గామాల్ను. ఇంతసేపైందేమిటి చెప్మా, యింటికి రావడానికి అనుకుంది విశాలమ్మ!

ఇంతలో చరచరా వచ్చి ఒక హార్లిక్స్ సీసా, ఒక పూలువుంట, ప్లాస్టిక్ నిట్టింగు సూదులు, ఒక క్రొత్తడిజైన్ల పుస్తకం, ఒక రబ్బరు దువ్వెనా, తన ప్రక్కనే పెట్టి కిక్కురు మనకుండా తన గదిలో కెళ్లాడు. విశాలమ్మకు ఆశ్చర్యంతో నోట మాట రాలేదు. సుశీ సంతోషానికి పగ్గాల్లేవు. "అన్నోయ్", "అన్నోయ్" అంటూ వాడివెంట పరిగెత్తింది...విశాలమ్మ ఆయన తట్టు చూచింది. ఆయనకూడా తెరుచుకున్న నోరు మూయకుండా చూస్తున్నాడు......

ఆయన, అబ్బాయీ, సుశీ మాట్లాడకుండా భోంచేస్తూన్నారు. సుశీమాత్రం క్షణానికొకసారి అన్నయ్యమొగం తట్టు చూస్తూంది, మెరుస్తూన్న చూపుల్తో!... విశాల చారు వడ్డిస్తూ పట్టలేక అడిగింది. "అబ్బాయీ! అవన్నీ పట్టుకొచ్చావు - డబ్బెక్కడిదోయ్?" అని.

సుశీ యిక వూరుకోలేక "అమ్మోయ్! అన్నయ్యాట - నాన్న మొన్న బస్సు సీజన్ టిక్కట్టు కొనుక్కోడానికని యివ్వలా పదిరూపాయలు - దాన్ని ఖర్చు పెట్టకుండా యివి కొన్నాట్టమ్మ!" అంది. విశాలమ్మ మనసు దేవినట్లింది బాధతో - అంటే అబ్బాయి యిక నెలరోజులు, దినానికి నాలుగుమైళ్ళు కాలేజీకి నడవాలన్నమాట! విశాలమ్మ కండ్లు కన్నీటితో బూజాలు కమ్మాయి. ఖాళీకంచంలో టప్పటప్పమని నీటిబొట్లు పడ్డంతో అబ్బాయి ముఖం పైకెత్తి అమ్మ మొగంలోకి చూచాడు ప్రశ్నార్థకంగా! ఒకప్రక్క సంతోషం, ఒకప్రక్క దుఃఖం వుక్కిరిబిక్కిరి చేస్తూంటే విశాలం వెకిలిగా నవ్వగలిగిందంతే, చేసేదింకేం లేక!

ఆ రాత్రే - ఆయనకు ఆకులు మడిచి పెడ్తూంటే అన్నాడాయన - "విశాలం! మనవి నిజంగా బరువు బ్రతుకులు! కాని ఆ బరువు మోయడంలో యెంత బాధవుందో, అంతఆనందంకూడా వుంది!... మనవుడు జీవితమార్గంలో ఎన్నోమార్లు జారిపడుతూనే వుంటాడు...కానీ ప్రతిసారీ, ఏదోఒకఆశ, ఏదో ఒకలక్ష్యం, ఊతకఱ్ఱగా ఆదుకుంటూంటుంది ... జీవితమంటే మన కప్పుడుండిన రంగురంగుల కలలన్నీ యిపుడు చెరిగిపోయినమాట నిజం! ... జీవితం అతి వాస్తవికం మనకు! ... నేలవిడిచి సాము చేయడంకాదు బ్రతకడం అంటే నన్న విషయం కండ్లకు కట్టిం దిపుడిపుడు. జీవితానికి కావలసింది నదికి కొండలమీదినుండి క్రిందికిదూకేటపుడుండే వురుకుమాత్రమే కాదు, విశాలమైన మైదానంలో ప్రవహించేటపుడుండే తొణుకూ బెణుకూలేని లోతు కూడా కావలసిందే! ... ఈరోజు చూచావుగా, మధూ, చిట్టీ, అబ్బాయీ - వీళ్ల హృదయాల్లోని వూహలలోతులు! - మానవత్వపువిలువలు, జీవితసత్యాలు వాళ్ళకిప్పట్నించే తెలుస్తూన్నాయి! వాళ్ళల్లో మానవత్వం మేల్కొంటోంది!...విశాలం!... నీకు దేముడిమీద పిచ్చినమ్మకముందిగా!... ఆ దేవుణ్ణి ఒక్కటే కోరుకో-మన ఆరత్నాలలో మానవత్వపు వెలుగు తరిగిపోకుండా చేయమని"

విశాలం ఒడిలోని పసివాడు కేరింతవేసి, బోసినోటితో ఒక్క నవ్వు నవ్వాడు, ఎందుకో!...విశాలం నవ్వింది! ... ఆయన కూడా నవ్వాడు! ★




# మాటల తీరుతెన్నులు ★ ఇల్లిందల సరస్వతీదేవి

కస్తూరి పెనిమిటి ఉద్యోగరీత్యా ఉత్తర హిందూస్థానము వెళ్ళవలసివచ్చింది. క్రొత్తదేశము చూడవచ్చునన్న ఉబలాటముతో పెనిమిటివెంబడి కస్తూరి వెళ్ళింది. కాని వెళ్ళినప్పటినుంచీ ఒక తీరుగా ఉత్తరాలు వ్రాయటము మొదలు పెట్టింది. అది దేశముకాని దేశమట; ఆ దేశస్థుల ఆహారము వస్త్రధారణ వేరట. వాళ్ళను చూస్తేనే తనకు భయముగా ఉన్నదట. వాళ్ళమాట వింటే తనగుండె దడదడలాడిపోతున్నదట. ప్రాణాలను అరచేతిలో పెట్టుకొని రోజులు గడుపుతున్నదట. ఈ ధోరణిలో గోల పెట్టుతూ వ్రాసింది.

ఇంత భయపడే కస్తూరి చిన్నపిల్లా కాదు. చదువురానిదీ కాదు. ఎక్కడికీ కదలకుండా ఒకవూళ్ళోనే ఉన్నపిల్లా కాదు. దేశమూ మాటా మారేసరికి కస్తూరికి ధైర్యము సడలిపోయింది. అది కాక, ఉత్తరహిందూస్థానమువారంటే బాల్యములో చదివిన దేశచరిత్రకథలు ఇంకా స్మృతిపథమునుండి పోలేదు. నాయనమ్మ తాతయ్య చిన్నప్పుడు చెప్పినకథలు మరువలేదు. ఈ కారణాలచేత క్రొత్తదేశములో ఉండటము ప్రాణాంతకమనిపిస్తున్నదామెకు. కస్తూరివంటివ్యక్తులు స్త్రీలలో పురుషులలో పిల్లలలో అనేకులు మనకు నిత్యమూ ఎదురవుతూ ఉంటారు.

ప్రజల ఆహారాన్నీ వేషధారణనూ బట్టి వారి దేశాన్నీ జాతినీ ఏవిధముగా తెలిసికొనగలమో, అలవాట్లనూ ఆచారాలనూబట్టి ఆ విధముగానే నిర్ణయించటానికి వీలున్నది. సాధారణముగా ఈ అలవాట్లూ ఆచారాలూ ఆయా దేశాల శీతోష్ణ పరిస్థితుల ననుసరించి ఏర్పడతాయని విశ్వసింపబడ్డది.

శీతలదేశాలలో ప్రజలు ఆపాదమస్తకము వస్త్రాలతో కప్పుకొంటారు. ఆచ్ఛాదనము లేకపోతే వారికి దేహము కరడుకట్టుకొనిపోతుంది. ఆ ప్రజల ఆహారము, వస్త్రధారణ దేహానికి ఉష్ణాన్ని కలిగించేవిగా ఉండాలి. ఈ విధముగానే ఉష్ణదేశాలలోని ప్రజలూ సమశీతోష్ణదేశాలలోని ప్రజలూ ఆయా దేశాల వాతావరణాన్ని అనుసరించి జీవిస్తారు.

ఆహారములో, వస్త్రధారణలో వివిధ దేశాలవారు వివిధ ప్రాంతాలవారు ఏ విధముగా భిన్నస్తులో, మానసికముగా స్వభావాలలో కూడా ఆ విధముగానే భిన్నస్తులని ఒక సామాన్యమైన విశ్వాసము ప్రజలలో ఉన్నది. జర్మనీ, బ్రిటన్, అమెరికా, జపాను, టర్కీ, చైనా, ఇండియా దేశాల ప్రజలను గురించి, వారి వారి స్వభావాలు ఈవిధంగా ఉంటాయని కచ్చితముగా చెప్పవచ్చునని తేలింది. ఈ నిర్ణయించటములో కొన్ని నమ్మకాలు విశ్వాసాలు దృఢతరమయి పాతుకొనిపోయాయి. అమెరికా వారు ఇటువంటివారనీ, బ్రిటీషువారు అటువంటివారనీ, జర్మనీవారు జపానువారు ఇట్లా ఉంటారనీ, అట్లా ఉంటారనీ - ఈ విధముగా ఒక్కొక్క దేశాన్ని గురించి ఒక్కొక్క భావము ఏర్పడిపోయింది.

విదేశీయులనుగురించి ఏవిధముగా అనుకొంటామో, మనలో మననుగురించి కూడా అలాగే అనుకుంటాము. గోంగూర తినే

(30-వ పేజీ చూడండి)



# మాటల తీరుతెన్నులు



వాళ్ళతో గెలవలేమనీ, రొట్టె తినే వాళ్ళందరూ బలముకలవారని, తెలంగాణా వారు దాతృత్వము కలవారనీ అమాయకులనీ, రాయలసీమవారు వెర్రిబాగులవారనీ, మరో ప్రాంతము వారు కక్ష ప్రధానమైనవారనీ, ఇంకెవరో అసాధ్యులనీ, మరెవరినో నమ్మకూడదనీ నమ్మకాలూ విశ్వాసాలూ మనలో కొందరు వెలిబుచ్చుతూ ఉంటారు.

'ఆ ప్రాంతంవారంతా ఇతరులను అణచిపెట్టే రకము' అనే దృఢవిశ్వాసాన్ని బలపరచుకోవటానికి 'ఆ గడ్డతీరు అటువంటిది' అంటారు సామాన్యముగా. సీతారామలక్ష్మణులు దండకారణ్యము వెళ్తూ ఉండగా వారికి దారిలో ఒక విచిత్రానుభూతి కలిగినదట. భ్రాతృసేవా తత్పరుడైన లక్ష్మణస్వామి శ్రీరామచంద్రుని చూసి 'భార్యతో సరాగాలాడుతూ నీవు ముందు నడుస్తుంటే- ఈ మూట పట్టుకొని మీ వెనుక రావటానికి నేను సేవకుడనా?' అని దురుసుగా అన్నాడట. మరికొంతదూరము పోయిన తరువాత ఆ లక్ష్మణుడే భక్తి గౌరవాలతో, వినయముతో ప్రవర్తించాడట. తమ్ముడి స్వభావములో ఈ మార్పు ఏవిధముగా వచ్చినదోనని శ్రీరాముడు మథనపడుతూ, ఆ స్థల పరీక్షకు వెళ్లగా, ఆయనకూ స్వభావములో రజోగుణము పైకి ఉబకటము మొదలు పెట్టినదట. దానితో ఈ మార్పుకు గడ్డతీరు కారణమయి ఉంటుందని నిశ్చయించుకొన్నాడట. ఈవిధమైన విశ్వాసము, ఆ గడ్డమీద నివసించే ప్రజల విషయములో ఇప్పటికీ ఉన్నట్లే కొందరు చెప్పుతూ ఉంటారు.

ఈనమ్మకాలు విశ్వాసాలు ఇతర దేశీయులను గురించీ, ఇతర ప్రాంతీయులనుగురించీ ఉన్నట్లే తమను గురించికూడా ఉంటాయి. బ్రిటీషువారు తాము శాంతిప్రియులమనీ, ధైర్యస్థులమనీ, శ్రమజీవులమనీ, తెలివికలవారమనీ, అనుకొంటారు. ఫ్రెంచివారు కూడా తమనుగురించి అవిధముగానే అనుకొంటారు. అమెరికనులు తమ దాతృత్వాన్నీ పురోగామిత్వాన్నీ, మేధాశక్తినీ, శాంతిప్రియత్వాన్నీ చాటుకొంటారు. మొత్తముమీద అన్నిజాతులూ తాము శాంతిని కాంక్షించేవారమని గాఢముగా నమ్ముతారు. భారతీయులు తాము శాంతి కాముకులే కాకుండా ఆధ్యాత్మిక చింత కలవారమని విశ్వసిస్తారు.

ఈ విషయాలనూ ఈ నమ్మకాలనూ విని మన సత్వశాస్త్రజ్ఞులు నవ్వుకొంటారు. 'మానవుల స్వభావాలు ఒక దేశానికీ ఒక జాతికీ ప్రత్యేకవివక్షతతో ఉంటాయా?' అని.

ఆడపిల్లలను సంబంధాలు చూసేటప్పుడు కుటుంబాలనుగురించీ, వంశాలనుగురించీ వాకబుచేస్తూఉంటారు. ఆ కుటుంబాల మర్యాద మార్గాలనుగురించీ, ఆయుః పరిమాణాన్నిగురించీ, కీర్తి ప్రతిష్ఠలనుగురించీ, ముందుగా విచారించి, తరువాత రాయబారాలు నడుపుతారు. ఆసందర్భాలలో 'ఆ వంశీయులంతా కర్కోటకులు - వాళ్లయింటికి పిల్లను ఇస్తే బ్రతుకుతుందా?' అనీ, 'ఆ కుటుంబాలు రాక్షసగణములో చేర్పతగినవి. పిల్లను ఇవ్వకూడద'ని కొందరిని గురించి తేలుస్తూ ఉంటారు. కొన్ని కుటుంబాలలో ఆడవాళ్ళమీద చెయ్యిజేసుకొంటారని వాడుక. కొందరు నాగరికులై ఉండికూడా, స్త్రీలను నికృష్టముగా చూస్తారని ప్రతీతి. కొన్ని ఇండ్లలో ఎంత విద్యావంతులయినా స్త్రీలను కర్ణకఠోరముగా తిట్టిపోస్తారని అనుకొంటారు.

కొన్ని గుణాలు అనువంశికముగా వ్యక్తుల స్వభావాలలో ఉండటానికి అవకాశము ఉన్నదనీ, వాతావరణప్రభావముచేత కొన్ని రావటానికి వీలున్నదనీ శాస్త్రజ్ఞులు నిరూపించారు. వీటిలో చేరనివీ, మనలో జీర్ణించిపోయినవీ మరికొన్ని విశ్వాసాలూ నమ్మకాలూ ఉన్నాయి. అవి మరీ విచిత్రముగా కనబడతాయి.

'వైద్యుల ఇండ్లలో అనారోగ్యమూ వ్యాసులూ ఉండవు; న్యాయవాదులు న్యాయముగా నడచుకొంటారు; సవతి తల్లులు పిల్లలను ద్వేషిస్తారు; అత్తలూ ఆడబడుచులూ కోడళ్ళను ఇబ్బందులు పెట్టుతారు; జ్ఞాతులను నమ్మకూడదు; ధనికులందరూ కఠినులు; పేదవారు సన్మార్గులు; ఉన్నతోద్యోగులు పైవారిని అనుసరించుకొని తిరుగుతూ క్రిందివారిని చిన్నచూపు చూస్తారు; గొప్ప ఉద్యోగుల భార్యలు సాటివారినిగాని పలుకరించరు; స్త్రీలు భర్తల ప్రతిభవల్లనే సంఘములో చలామణీ అవుతున్నారు; స్త్రీల చిత్తము ప్రతి క్షణానికీ మారుతుంది. పిల్లలందరూ అల్లరి చేస్తారు; అల్లుళ్ళకు ఆశ ఎక్కువ; కూటికి లేనివారికి ఆత్మగౌరవము ఉండదు; పెద్దవాళ్ళందరూ గౌరవించతగినవారు'; ఇటువంటి నమ్మకాలూ విశ్వాసాలూ చాలా ఉన్నాయి. వీటినిగురించి వింటూఉంటే - అత్తలూ, అల్లుళ్లూ, సవతి తల్లులూ ఉద్యోగులూ ఒక వంశములోనివారా గుణాలు పట్టుబడటానికి?' అనిపిస్తుంది. పోనీ—వీరంతా ఒక దేశమువారుగా గానీ-ఒక జాతివారుగా గానీ, ఒక ఊరివారుగా గానీ ఉన్నారా అంటే—అదీ కాదు!

మానవ స్వభావము మాట అలా ఉంచి, పరిస్థితులు అందరికీ సమానము కనుక ఇవి సమిష్టిగా చేసిన నిర్ణయాలేమో ననిపిస్తుంది.

ఇవి ప్రవాదలనుకొన్నా, నిత్యసత్యాలనుకొన్నా ఈ నుడులు నానుడులయి సామెతలయి బహుళప్రచారములో ఉన్నాయి.

ఈ నమ్మకాలకూ విశ్వాసాలకూ మూలము ఏమిటి? ఆధారాలు ఏవి?

ఇవన్ని సామూహిక ప్రవర్తనమీద ఆధారపడి ఉన్నాయి. ప్రతి మనిషీ ప్రతి విషయాన్నీ స్వయముగా ఆలోచించి నిర్ణయించడు. ఎవరో ఒకరు నిర్ణయించి తన కందించిన నిశ్చయాన్ని అందుకొని, తాను ఇతరులకు బాధ్యతారహితముగా అందజేస్తాడని మన కెవరయినా చెప్పితే నమ్మగలమా?

ఈ నమ్మకాలూ విశ్వాసాలూ పిల్లలలో కూడాబాగాపాతుకొనిపోయినవిఉన్నాయి. ఇవన్నీ పిల్లలకు పెద్దలు కలిగించినవే. మాటవరుసకు పెద్దవాళ్లెవరూ దయ్యాలనుగానీ, రాక్షసులనుగానీ చూసి ఉండరను కొందాము. అయినా వాటినిగురించి చాలా భయంకరముగా వర్ణించి పిల్లలకు చెప్పతూ ఉంటారు. పిల్లలు ఎవరినైనా ఆత్మీయులుగాను శత్రువులుగాను భావించటానికి కారణము పెద్దలబోధలేగాని పిల్లలస్వబుద్ధికాదు. ఇతరులనుగురించి మంచిగా బోధిస్తే మంచి, చెడుగా బోధిస్తే చెడు, వాళ్ళ మనసులలో నిలచిపోతుంది.

పిల్లలలో ఈ విశ్వాసాలూ నమ్మకాలూ ఏవిధముగా ఉన్నాయో నని ఒక శాస్త్రజ్ఞుడు స్విస్ పిల్లలను ప్రశ్నించి తెలిసికొంటే ఈవిధముగా తేలింది.

'నీవు విదేశీయులనుగురించి విన్నావా?' అని ప్రశ్నిస్తే, ఒక ఎనిమిది సంవత్సరాల పిల్ల 'జర్మనీవారినీ ఫ్రెంచివారినీగురించి విన్నాను' అన్నదట. 'ఆ రెండుజాతులకు ఏమిభేదము?' అని ప్రశ్నించితే 'జర్మనీవారు ఎప్పుడూ యుద్ధాలు చేయాలంటారు- కనుక మంచివారు కారు. ఫ్రెంచివారు పేదలు కనుక వారిదేశము చూడటానికి అసహ్యముగా ఉంటుంది. రష్యాదేశీయులను గురించి విన్నానుగాని నాకు వారిదేమీ నచ్చలేద'ని జవాబిచ్చినదట. 'ఈ దేశీయులలో ఎవరితోనయినా నీకు పరిచయము కలగటము తటస్థించిందా?' అని అడిగితే 'అందరూ అలా అనుకొంటారుగా!' అని నవ్వినదట. ఈ ప్రశ్నలనే పదమూడు సంవత్సరాల పిల్లవాడిని అడిగితే అందరినిగురించీ తాను విన్నవీ, తనకు తోచినవీ చెప్పి 'అన్ని దేశాలలోనూ అన్నిరకాలవారూ ఉంటార'ని జవాబు చెప్పాడట. (యునెస్కో కొరియరు నంబరు 6 - 55)

పిల్లలలోగాని పెద్దలలోగాని ఉన్న ఈ విశ్వాసాలకూ నమ్మకాలకూ వాల్టర్ లిప్‌మన్ స్టీరియో టైప్సు (*Stereo types*) అని పేరు పెట్టాడు. వీటినిగురించి ప్రసంగిస్తూ ఆయన 'వీటిలో సత్యము ఉన్నదో - ఎంత



అమ్మకి తాయిలం

ఫొటో: ఎ. వి. ప్రసాద్ — విజయవాడ.

ఉన్నదో - సత్యమువంటిది మరేదయినా ఉన్నదో - ఆలోచించటానికి ఎవరికీ తోచదు. కనీసము ఈ వర్తమానము ఎక్కడి నుంచి వచ్చినదన్న కుతూహలమయినా ఉండదు. విన్నది విన్నట్లుగా ఇతరులకు అందజేయటమే - అందులోనూ బాధ్యత ఏమాత్రము లేకుండా - ప్రజల పని' అన్నారు.

"ఈ నమ్మకాలూ విశ్వాసాలూ ఒకరి నుండి ఒకరికి సంక్రమించటములో కొన్ని విశేషాలూ వింతలూ జరుగుతూ ఉంటాయి. ఎక్కడో కనుచాటున ఉన్న వారిమీద ఒక రకమైన అభిప్రాయము మన మనస్సులో ఉన్నదనుకొందాము. మన దృష్టిలో సజ్జనుడూ సహృదయుడూ అయిన వ్యక్తి, మన కెంతో సన్నిహితుడుగా ఉన్నవాడు ఆ తరగతిలోనివాడని తెలిసినట్లయితే, మనకు అంతకు పూర్వము ఆయనమీద ఉన్న సదభిప్రాయాలు మారే అవకాశము ఉన్నదా? మనలో చాలామంది బింకాలకు పోయినా, సామూహిక ప్రవర్తనను గురించి పరిశోధించిన శాస్త్రజ్ఞులు పూర్వపు అభిప్రాయాలు మారే అవకాశా లున్నాయని నిర్ణయించారు.

ఈ నమ్మకాలూ విశ్వాసాలూ కాలాన్ని బట్టీ, తరుణాలనుబట్టీ కూడా మారుతూ ఉంటాయి. ఒక హాలెండు దేశపు శాస్త్రజ్ఞుడు యూరపుఖండములో ఉన్న హంగేరియనులనుగురించి చారిత్రకమైన మార్పులను వివరించాడు. హంగేరియనులు మధ్యయూరపుకు వలసవచ్చిన కొన్ని శతాబ్దాలవరకు వారికి మంచిపేరు లేదట. కాగా వారి నాగరికత భిన్నముగా ఉన్నది కనుక యూరపు దేశస్థులకంటె తక్కువ రకము అని సామాన్యముగా అనుకొనేవారట. కాని 15, 16 శతాబ్దాలలో టర్కీవారితో యూరపుకు యుద్ధము సంభవించినప్పుడు, హంగేరియనులు యూరపు దేశస్థుల పక్షము వహించిన తరువాత, పూర్వపు అభిప్రాయాలు మారి

## మాటల తీరుతెన్నులు

పోయినవట. అప్పటినుండీ హంగేరియనులు ధైర్యమూ పరాక్రమమూ కలవారుగా పరిగణింపబడుతూ వచ్చారు. ఈ విశ్వాసాలు తిరిగి 18 వ శతాబ్దములో తారుమారయినవి. ఈ తారుమారులు చరిత్రలో రెండు మూడు పర్యాయములు జరిగినవని ఆ శాస్త్రజ్ఞుడు నిరూపించాడు.

ఇరుగుపొరుగులనుగురించి గానీ, బంధువులు స్నేహితులనుగురించిగాని, విదేశీయులనుగురించిగాని మనకుతోచినది తోచినట్టుగా వ్యక్తము చేసినందువల్ల చాలా ప్రమాదాలు ఉన్నాయి. అందులోనూ శ్రోతలలో అటువంటివా రెవరైనా ఉంటే మరింత ప్రమాదము. ఎవరిని గురించిగానీ ప్రత్యక్ష పరిచయము లేకుండా ఇతరులు నిర్ణయించిన విశ్వాసాలనూ నమ్మకాలనూ అంధానుకరణముగా అవలంబించటములో విదేశీయులను గురించి మరింత జాగ్రత వహించటము మేలు. ప్రపంచములోని మానవులందరూ ఏకమై సుహృద్భావముతో సోదరులవలె మెలగితేగాని, జగత్కళ్యాణము సిద్ధించదని ఈనాడు అన్ని దేశాలూ ఆమోదించాయి. వ్యక్తుల మధ్య సుహృద్భావము కలగటానికీ పెంపొందటానికీ ఒకరినిగురించి ఒకరు చక్కగా తెలిసికొని ఉండాలి. వారిలో ఉన్న మంచినే గ్రహించాలి. దానినే అందరికీ తెలియజెప్పాలి. ఈ సూత్రాలను అందరూ ఆచరించినట్లయితే ప్రపంచములో-దేశాలమధ్య, జాతులమధ్య, మతాల మధ్య, వ్యక్తుల మధ్య - వైరాలు, వైమనస్యాలు, విరుద్ధభావాలు నశించి, పరస్పర సుహృద్భావాలు అంకురించి పెంపొందుతాయనటములో సందేహము లేదు. ఈ భావాలు ఉద్భవించటానికి నిష్కల్మషమైన వాతావరణము అతిముఖ్యమైనది. ఇటువంటి వాతావరణము భావిపౌరులయిన బిడ్డలకు కలిగించటము చాలా అవసరము. దీనికి ఇండ్లలో తలిదండ్రులూ, పాఠశాలలలో ఉపాధ్యాయులూ బాధ్యత వహించవలసినవారు. వీరిపైన ప్రపంచశాంతి ఆధారపడి ఉన్నది.

★



వనితాలోకం:

# వారు ముగ్గురు

## ద్వివేదుల విశాలాక్షి

తెల్లవారి లేచేసరికి పాడుపడ్డ దెయ్యాల కొంప ముందర అలికి ముగ్గులున్నాయి. ఇదిమాసి ఆ గ్రామప్రజలు ఆశ్చర్యాందోళనలతో ఒకరిముఖాలొకరు వింతగా చూసుకొన్నారు. నాకు తెలియదంటే నాకు తెలియదన్నట్లు అందరికళ్లూ ఒక్కమారు కలుసుకొన్నాయి. నిజానికిది అంత ఆశ్చర్యం ఆందోళన పడవలసినంత గొప్పసంగతి కాదు. పట్నాలలో అయితే పొరుగువారి ఇల్లు తగులపడుతున్నా ఇంకా తమ దాకా రాలేదుకదా అని వూరుకొంటారు. ఒకరి మంచి చెడ్డలలో, కష్టసుఖాలలో మరొకరికి ప్రమేయం ఉండదు. ఇతరుల పనిపాట్లలో జోక్యం కలిగించుకొనే తీరికకూడా వారికుండదు. కాని పల్లె ప్రజలుమాత్రం ఊరిలో వున్న వారందరి భాగ్యతా తమ భుజస్కంధాలమీద వున్నట్లే భావిస్తారు. పూర్వపు రోజులలో ఈ భావనే ఎంతో సహాయకారిగా వుండి పల్లెలలో ఐకమత్యం, సంఘజీవనం ఎంతో సంతృప్తికరంగా వుండేవి. కాని నేడు ఈభావనే పల్లెలకు చీడపురుగులా అంటుకుని శాంతి అనే పదానికి తావు లేకండా గ్రామజీవనాన్ని కల్మషం చేస్తున్నది.

ప్రతి గ్రామంలోను వార్తాహరుల వంటివారు కొందరైనా వుండకమానరు. వీరికి ఎవరిఇంట్లో ఏమిజరిగినా, ఎవరిమనస్సులో ఏమివున్నా, ఎలాగైనా కూపీతీసి, అసలు వృత్తాంతానికి మరి నాలుగు కల్పించి జనబాహుళ్యానికి అందచేయందే నిద్రరాదు.

దెయ్యాలకొంప ముందర ముగ్గులు చూడగానే కామమ్మ సోమమ్మ బయలుదేరేరు విషయాన్వేషణకి.

"ఏమండోయి! ఎవరున్నారు ఇంట్లో? దెయ్యాలా, దేవతలా, మనుష్యులా?" అని దండకంలా చదువుతున్నాది కామమ్మ. ఆమె మాటలు ఇంకా పూర్తికాక మునుపే, లోపలున్న వారు తలుపు తెరుచుకొని బయటకొచ్చారు. వచ్చినవారు ముగ్గురూ స్త్రీలే. అందులో మధ్యనున్న ఆమె మిగతా ఇద్దరి కన్నా కొంచెం పెద్దదానిలా కన్పిస్తున్నాది. రమారమి ముప్ఫై యేళ్లుండవచ్చు అనుకున్నాది సోమమ్మ. మిగతా యిద్దరికి ఇరవై, పాతిక ఆమధ్యనుంటాయి అనుకొంది కామమ్మ. ఆ ముగ్గురు స్త్రీలు జెండా అంచుగల ఖద్దరు చీరలు కట్టుకున్నారు. వంటిని అట్టే అలంకారాలు లేకపోయినా వున్న రెండేసి గాజులు, మెళ్లో గొలుసు తళతళ మెరుస్తున్నాయి. వారు ముగ్గురు అంతఅందకత్తెలని చెప్పలేకపోయినా అనాకారులు మాత్రం కారు. లక్ష్మీకళ ముగ్గురి ముఖాలలోను తాండవిస్తున్నాది. వారు ముగ్గురు ఐక్యకంఠంతో "రండి మామ్మగారు" అని పలకరించేరు.

"మీరు ఈ యింట్లోకి రాత్రే వచ్చేరులాగుందే?" అన్నాది కామమ్మ ఒక్క అడుగైనా ముందుకి వేయకండానే.

"అవునండి. నిన్న రాత్రే వచ్చేము" అన్నాది ఆ ముగ్గురిలో పెద్దది. అంతే కాని ఎందుకొచ్చేరో, ఏ వూరునుంచి వచ్చారో, ఎవరెవరు వచ్చారో ఏమీ వివరంగా చెప్పనందుకు మండిపడ్డాది సోమమ్మ తనలో. కాని వారి వేషాలనుబట్టి, అంటీ అంటనట్లున్న సమాధానాలనుబట్టీ పట్నంనుండే వచ్చేరని, అందులోను రాత్రి రైలులో ముగ్గురూ ఆడవాళ్లే వచ్చారు కాబట్టి, చదువుకొని ఇల్లూ వాకిలీ పట్టకండా తిరిగే రకమని గ్రహించుకొన్నాది సోమమ్మ.

ఇల్లు నాలుమూలలా కలయచూసింది. అన్నీ పరిశుభ్రంగా, నీటుగా ఎక్కడివక్కడ అమర్చివున్నాయి. ఒక్కరాత్రిలో ఆ దెయ్యాల కొంపని అంత బాగా చేసేరంటే...ఒక వేళ వీళ్లుకూడ దెయ్యాలు కారుగదా? అనుకొంది. ఆమాట తోచగానే ఆమె కాళ్లు గడగడలాడి మరి నిలబడలేకపోయింది. "రావే కామమ్మా! మరి మనకు పనీ, పాటూ లేదా" అంటూ ఇవతల బడింది.

ఇవతలబడి సరాసరి నీలాటి రేవుకే బయలుదేరింది. సగము దూరము వచ్చేదాకా తను బిందె తేలేదన్న సంగతే ఆమెకు స్పృహ రాలేదు. ఇంటికి వెళ్ళి బిందె తెస్తూ మరోమాటు చూసింది, ఆ పాడుకొంప

వైపు. ఆ ముగ్గురు యువతులూ పెరటిలోని గడ్డీ, గాదరా పీకి పారవేసి పెరడు శుభ్ర పరుస్తున్నారు. చదువుకొన్న వాళ్ళకి ఈ ఓపిక వుంటుందా, అని ఆశ్చర్యపోయింది సోమమ్మ. నిజంగా పిచ్చి దెయ్యాలేమో? అని మళ్ళా జ్ఞాపకానికొచ్చి ఒకసారి పరుగు తీసింది నీలాటి రేవుకు.

"ఒసే పేరమ్మా! కన్నమ్మా, నిన్నే నే గున్నమ్మా! మన వూరికి కామినీ భూతాలు ఒచ్చేయర్రా,... కామినీ భూతాలు. నిన్న రాత్రే దెయ్యాల కొంపలో దిగేయి. ఇక మనమందరం పోతే పోవాలి కాని అవి మాత్రం ఆ కొంపను వదిలేలా లేవు అప్పుడే ఇల్లంతా ఎంత బాగుచేసుకొన్నాయి పెరట్లో మొక్కలు కూడ నాటుతున్నాయి." అన్నాది సోమమ్మ.

"ఎలాగ మరి కామమ్మొదినా మన భూతాల పేరయ్య కూడ వూళ్లో లేడు. వారం పదిరోజులకి గాని రానని చెప్పి నిన్ననే వూరికి వెళ్లేడు. ఈలోగా ఈ దెయ్యాలు మన లందరినీ తినేస్తాయేమో?" అన్నాది భయంగా కన్నమ్మ.

గున్నమ్మ గొంతు బాగా తగ్గించి "మన మాటకేమేఁ; ముందర మగవాళ్ళను కాచుకోవాలి. అవి కామినీ భూతాలు" అన్నాది.

"అయ్యో! అలాగా. నాకేం దారమ్మా. తల్లీ మా కాలమ్మా నా పసుపు, కుంకాన్ని నిలిపేవంటే నీ జాతరనాడు నీకు పసుపు కుంకము పంపుకొంటాను, నీదే భారం తల్లీ! అని గ్రామదేవతకి దండం పెట్టి యింటికి బయలుదేరింది కన్నమ్మ. దెయ్యాల భయంతో గుండెలు పీచుపీచు మంటున్నా, ఇళ్ళలో పనులు తప్పవని మెల్లగా బయలు దేరారు ఆ గ్రామస్త్రీలు నీలాటి రేవునుండి.

* * *

అప్పుడే దెయ్యాలు వూరిలో దిగి మూడు రోజులయింది. కాని ఇప్పటిదాకా అవి ఎవరికీ ఏహానీ చెయ్యలేదు. అసలు ఆగడ పదాటి ఇవతల కాలు పెట్టనేలేదు. అవి ఆయింట్లో ఏమి చేస్తున్నాయో మాద్దామని వుద్దేశమున్నా, గుమ్మాలకి, కిటికీలకి వున్న తెరలమూలాన గ్రామస్థులకు వీలు కాలేదు. ఇంట్లోకి వెళ్లడానికి అందరికీ హడలే. ఈ భయం ఆడవాళ్లనుండి మొగవాళ్లదాకా ప్రాకింది. ఆ వూరిలోకల్లా బహు నిబ్బరమైనవాడు, చదువుకొన్నవాడు అయిన గ్రామమునసబు రంగారావు వూళ్లో లేడు. నాలుగోనాటికి అతను వూరినుంచి వచ్చే సరికి, దెయ్యాలు వంకర కాళ్లు, సొట్టచేతులు వూపుకొంటూ ఎలా వచ్చినదీ; అందరు మాస్తుండగానే ఆ పాడు ఇల్లు ఎలాగ నీటుగా మారిపోయిందీ, కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తూ చెప్పేరు సోమమ్మ, కామమ్మ అతనితో.

వీళ్లమాటలు లెక్కచేయకపోయినా

# ★ వారు ముగ్గురు ★

వీరితో విరోధము పెట్టుకోడానికి ఎవరికీ ఇష్టం ఉండదు. అలా ఎవరేనా చేస్తే వారి సంసారాన్ని భూస్థాపితంచేసి మరీ నిద్ర పోతారు. అందుచేత రంగారావు "సరి లెండమ్మా! వాటిసంగతీనే కనుక్కుంటా. మీరు భయపడకండి" అన్నాడు వూరడింపుగా.

ఇంతలోనే అతనిభార్య కన్నమ్మ వచ్చి అమాంతంగా అతని కాళ్లు పట్టుకొని "మీ రాయింటికి వెళ్ళకండి; నన్నూ, పిల్లల్నీ అర్ధాన్నం చేస్తారా? ఎంకెప్పుడూ మీ మాట కాదనను. అమ్మాణ్ణి మీయిష్టమొచ్చిన వాడికే యిచ్చి పెళ్ళిచేయురుగాని, నేనింకెప్పుడూ పుట్టింటికి పోతానని బెదిరించను, నాకు కాసులు, కంటే అసలేవద్దు. నా మాట వినండి, నాపసుపుకుంకము నిలపండి" అని ఒకటేఏడుపు మొదలెట్టింది. ఇదంతా చూస్తున్న రంగారావుకు ఏడవాలో, నవ్వాలో తెలియలేదు "సరే, నేను వెళ్లను వారికి రావన్నచేత గెంటిస్తాను సరేనా" అని నెమ్మదిగా ఆమెను ఊరడించి, రావన్నను వున్న సంగతి కనుక్కురమ్మని పంపేడు.

వెళ్ళినరావన్న వెంటనేవచ్చి "వారికి మీ కోసం పనుందట. ఆరే వత్తామన్నారు" అన్నాడు. దానితో వూరిలోని జనం అంతా రంగారావు ఇంటిముందర పోగయ్యేరు. కర్రలూ, కత్తులూ పట్టుకొని కొందరూ, విభూతి, రుద్రాక్షమాలలు పట్టుకొని కొందరు; ఆంజనేయ దండకం చదువుతూ కొందరు; కాని అందరు వారవారల నక్కి వున్నారు. రంగారావు మాత్రం నిర్వికారంగా ఈజీచైరులో కూర్చుని పేపరు చదువుకొంటున్నాడు.

ఆ ముగ్గురు యువతులూ అన్న వేళకి సరిగా రానేవచ్చేరు. కొందరు చదువుతున్న ఆంజనేయదండకం కాని, త్రోవలో చల్లిన విభూతి కాని, వారి రాకను ఆపలేక పోయేయి. రంగారావు వారికి ఎదురుగా వెళ్లి స్వాగతమిచ్చేడు. వారు ముగ్గురూ అర గంటసేపు రంగారావుతో ఏమేమో ఇంగ్లీషులో మాట్లాడి ఎలా వచ్చినవారు అలానే వెళ్లిపోయేరు. వారు దెయ్యాలు కారనీ, మన గ్రామాలపాలిట దేవతలవంటివారనీ, సాంఘిక సేవనే పరమావధిగా పెట్టుకొని మన పల్లెలను బాగుచేయడానికి వచ్చేరనీ, అందుకు గ్రామ మునసబుయొక్క అనుజ్ఞ లేందే వీలులేదు కాబట్టి, ఈ మూడురోజులు వూరుకొన్నారనీ, రంగారావు ఎంత చెప్పినా గ్రామస్థుల అనుమానం పోలేదు. సోమమ్మ, కామమ్మ నిశ్చయించుకొన్నదేమిటంటే, రంగారావు ఆ దెయ్యాలకి లొంగిపోయేడని.

* * *

ఆ యిల్లే కాక మరి రెండు యిళ్లు కూడా ఆ దెయ్యాలు వశము చేసుకొన్నాయి. అయిదారుగురు నౌకర్లు కూడా పట్నం నుంచి వచ్చేరు. వారితో కొంత సామాను, ఒక వంటమనిషి, ఒక పనిమనిషి కూడా వచ్చేరు. వారు తెచ్చిన సామాన్లలో చాలమట్టుకు ఆ గ్రామప్రజలు ఏనాడూ చూడనివే. ఆ మూడు యిళ్లకి, ద్వారాలకు రంగులు, గుమ్మాలకు పసుపు, కుంకుమ రాసేరు. పట్నంనుంచి తెచ్చిన పూలకుండీలను ఇళ్ల ముందు అందంగా అమర్చేరు. గ్రామస్థుల భయసందేహాలలావున్నా ఈ యిళ్లదగ్గరికి రాకండా వుండలేకపోతున్నారు. ఒకనాటి వుదయాన్న మూడు యిళ్లముందర మూడు రంగుల జండాలు పాతేరు. రంగారావులాటి యువకులు ఎవరో ఒకరిద్దరు వెళ్ళేరు. మూడు ఇళ్ళకీ ముచ్చటగా తెలుగులో వ్రాసిన బోర్డులు కట్టేరు. రవణయ్య పంతులు బళ్లో గుణింతాలు నేర్చుకుంటున్న పిల్లలు ఆ పేర్లను "రామాపుర గ్రామ మహిళా మందిరము", "రామాపుర గ్రామ వైద్యాలయము"; "రామాపుర గ్రామ ఉచిత విద్యాలయము" అని కూడబలుక్కొని చదువుకొన్నారు. ఆ ముగ్గురు యువతులూ అక్కడికి చేరిన పిల్లలందరికీ మిఠాయిలు పంచిపెట్టేరు. "మీరు ఈ స్కూలుకి వచ్చి బుద్ధిగా చదువుకొంటే, మీకు రోజూ ఇలానే మిఠాయి పెడతాము" అన్నారు. పిల్లల ఆనందానికి మేరలేదు. "రవణయ్య పంతులు పిలకా హుళాక్; మేమా బళ్లో చదవం పోత్" అని గోలచేసుకొంటూ ఇళ్ళకి వెళ్ళిపోయేరు - కాని; ఏ తల్లిదండ్రులూ తమ పిల్లల్ని ఆ స్కూలుకి పంపడానికి ఇష్టపడలేదు. రంగారావు ఇద్దరు కొడుకులు మాత్రమే వెళ్తున్నారు. వారము రోజులలో పట్నంనుండి ఓ పదిమంది పిల్లలు వచ్చేరు. వారి శుభ్రత, తెలివితేటలు చూసిన మీదట గ్రామ ప్రజలలో సంచలనము ప్రారంభమైంది. "రవణయ్య పంతులు బళ్ళో ఎన్నాళ్లు చదివినా అంతే! చూడు.. నిండా పదిరోజులు కాకమునుపే రంగారావు కొడుకులు ఇంగ్లీషు పేర్లు చదువుతున్నారు; చకచకా లెక్కలు ఎలా చేస్తున్నారో" అని గుసగుసలు బయలుదేరేయి. ఇంతకీ కామినీ భూతాలు పెద్దవారిని బాధిస్తాయి కాని పిల్లల్ని ఏమీ చెయ్యవని భూతాల పేరయ్య తీర్మానించేడు. మరునాటినుండి గ్రామంలోని పిల్లలంతా బిలబిలా బయలుదేరేరు కొత్త స్కూలుకి. కొందరు రహస్యంగా వైద్యాలయానికి వెళ్లి మందులుకూడా తెచ్చుకొంటున్నారు. గ్రామంలో క్రమక్రమంగా మార్పు వస్తున్నాది. ఇదివరలో వారు ముగ్గురి గురించి వున్న భయం గ్రామస్థుల మనస్సులలోంచి దూరమౌతున్నాది కాని సోమమ్మ, కామమ్మ మాత్రం వారి నమ్మకాలను వదల లేదు. వారు ముగ్గురూ తప్పక భూతాలేననీ; లేకుంటే ఇంతమందిని ఇలా తమ వేపుకు లాక్కోలేరనీ; ఇంక ఈ గ్రామానికి నాశనం దాపురించిందనీ; అడిగినవారితోను అడగనివారితోను చెప్తున్నారు. అంతేకాక రాత్రి వేళల కొరివి దయ్యాలు ఊళ్లో తిరుగుతున్నాయని, వారు ముగ్గురు ఆ దెయ్యాలతో ఏదో గుసగుసలాడుతున్నారనీ, ఆ కొరివి దెయ్యాలు మాకులక్రిందినుంచి తిరుగుతున్నాయి కాబట్టి ఇక అగ్నిభయం గ్రామానికి తప్పదనీ, మరో భీతిని ప్రజలలో రేకెత్తించేరు. గ్రామస్థులందరూ రాత్రియేసరికి గుప్పిటప్రాణాలు పెట్టుకొని కాలక్షేపం చేస్తున్నారు.

కొన్నిరోజులు గడిచేయి ఆ మూడు సంస్థలు - ఆ ముగ్గురి నాయకత్వం క్రింద అభివృద్ధి చెందుతున్నాయి. అవి యిప్పుడిప్పుడే ప్రజల ఆదరాభిమానముల నందుకోగల్గుతున్నాయి. ఒకనాటి నిశిరాత్రిలో వూరుమధ్యలో ఇళ్ళు అంటుకొన్నాయి. ఇళ్లను అంటించి పారిపోతూన్న ఒకవ్యక్తిని పట్టుకొన్నారు. ఆ వ్యక్తి దెయ్యమో, మనిషో చూచేతీరిక గ్రామస్థులకేది? వెంటనే ఒక గదిలోవుంచి తాళము వేసి మంటలనార్పడానికి బయలుదేరేరు. గ్రామస్థులంతాకలసి బహుకష్టంతో ఆమంటలను ఆర్పేసరికి తెల్లవారింది. ఆ ఆపద సమయంలో వారు ముగ్గురు చేసిన సేవకి, చిన్న, పెద్ద అందరి హృదయాలలోను వారిపట్ల కృతజ్ఞతాభావము వెల్లివిరిసింది. గ్రామస్థులంతా ఐక్యకంఠంతో "రంగారావు చెప్పింది అక్షరాలా నిజం. మీరు ముగ్గురూ మాగ్రామంపాలిట దేవతలు తల్లీ" అన్నారు. తమ కృషి ఈనాటికేనా ఫలించి గ్రామస్థులలో మార్పువచ్చినందుకు సంతోషించేరు వారు ముగ్గురు.

గ్రామమంతా చల్లబడి మంటలు ఆరిపోయిన తరువాత ఈ అనర్థానికి కారణమైన ఆవ్యక్తిని, కాదు, కాదు, కొరివిదెయ్యాన్ని గదిలోనుండి బయటికి లాగేరు. ఆవ్యక్తిని చూసి గ్రామస్థులంతా ఆశ్చర్యపోయేరు. దెయ్యాలభయం పోయినందువల్ల పొట్టకూడు పడిపోయిన భూతాల పేరయ్య! ★




# రాము మారాము! ★

అలపర్తి వెంకటసుబ్బారావు

'రాము'అనే బాలుడు మా
రాము జేయసాగినాడు,
"అమ్మా! నా కాడుకొనగ
బొమ్మయొకటి కావలె"నని.

వస్తు వస్తు నాన్నగారు
తెస్తారులె మంచిబొమ్మ!
పండుకొనుము బాబు! యింక
పక్కవైతు చక్కగాను"

అనుచు, తల్లి బ్రతిమాలెను,
అయిన, రాము వినడాయెను!
పైపెచ్చుగ నీరీతిగ
పలికినాడు మెల్లగాను!

"నాన్న బొమ్మ తెచ్చినపుడె
కన్ను మూతు నమ్మ నేను!
పక్కలోన బొమ్మనుంచి
పండుకొనగ కోర్కనాకు!"

ఇంతలోనె రామునాన్న
ఇంటికి విచ్చేసినాడు.
అంతటనా రాము, నాన్న
నడిగినాడు యీరీతిగ,

"వస్తు వస్తు మంచి బొమ్మ
తెస్తా వని చెప్పెనమ్మ!
తెచ్చావా? నాన్న! బొమ్మ
తెస్తే చూపించునాకు"

"కొన్నాడను నీకోసం
కోతిబొమ్మ నొకదానిని
కాని, దారిలోనె దాన్ని
కాకియొకటి తన్నుకెళ్లె!"

అని చెప్పెను రామునాన్న!
అటుపిమ్మట యేడ్చియేడ్చి
కన్నుమూసి నట్టి రాము
'కల'గనె నీరీతిగాను!

* * *

'కావు కావు' మనుచుండెను
కాకియొకటి చెట్టుమీద!
చెట్టుక్రింద నిలచి బాలు
డిట్టు లడుగ సాగినాడు,

"కాకమ్మా! కాకమ్మా!
కాజేస్తివ నాబొమ్మా?
ఏమిజేసు కొందువీవు,
యిచ్చివేయ వమ్మనాకు.

"మర్యాదగ తెచ్చియిస్తె
మంచి తాయ మిదుదునీకు!
లేనియెడల భూమిమీద
లేదు బ్రతుకు యింకనీకు!"

ఆమాటకు కాకి యపుడు
సమాధాన మొసగె నిట్లు,
"బాలకుడా! తొందరపడి
పలుకుచుంటివోయి నీవు!"

"మోసమన్న దెరుగబోవు
లేశమైనగాని నీవు!
అందువలనె, నిజమేనని
అనుకొంటివి నాన్నమాట!

"మానిపించ నీదుపట్టు
మాయమాట లిట్లు చెప్పె!
కానె, మీనాన్న నాడు
కొనలేదో బొమ్మ గూడ!"

"పోని, రేపైనా సరె
కొని తెమ్మని అడుగువాడ!
కాకమ్మా! బొమ్మలసలు
కాజేయవు గదా నీవు?"

అని, అడిగెను బాలు డపుడు
అంత, కాకి యిట్లనియెను,
"ఒట్టు బెట్టుకొందునేను
చిట్టిబాబు! నమ్ము నన్ను!"

* * *

రాము లేచి తిరిగి మా
రాము జేయ సాగినాడు,
"అమ్మా! నా కాడుకొనగ
బొమ్మ యొకటి కావలె"నని

అంత, రామునాన్న నాడు
సంతకెళ్లి బొమ్మయొకటి
తెచ్చినాడు-రాము చేతి
కిచ్చినాడు ఆడుకొనగ!




# కోడిపుంజులు

రెండు కోడి పుంజు
లుండె నొక్క యింట;
పెంటి దాని కొరకు
రెంటి కాయె పోరు.

ముక్కులతో పొడిచి,
రక్క, బరికి, కొరికి,
కుక్కుటములు రెండు
అక్కజముగ పోరె.

చివరకొక్క పుంజు
చిత్తు చిత్తుగాను
ఓడి పారిపోయి
గూడులోన దాగె.

గెలిచినట్టి పుంజు
గేలిచేయు చపుడు
ఇంటికప్పు మీది
కెక్కి కూయసాగె:

"ఎవ్వరింక నాకు
ఎదురు వచ్చువారు?
దమ్ములున్న రండు,
దుమ్ము చేసివేతు!"

అని సవాలు చేసి,
అతిశయించి పలుక,
గగనమార్గమందు
ఎగుచు డేగ వినెను.

కోపగించి డేగ
కోడి పుంజుకడకు
తిన్నగాను వచ్చి
తన్నుకెగిరిపోయె.

అంత, గూట దాగి
చింత నొందు పుంజు
సంతసాన పెంటి
చెంతజేరి నిలిచె.

ఈసప్ కథలు: 17

నండూరి రామమోహనరావు



నీతి

అహంభావ దుర్గుణమ్ము
అల్పత్వము సూచించును.

వినయముగల బలశాలికె
విజయమెపుడు శోభించును.

(పెద్దకథ)

# హిరణ్మయి

## 13

హెర్మియా వెళ్లి పడుక్కుని ఆలోచించటం ప్రారంభించింది. ఆలోచిస్తోనే ఆమెకు నిద్ర పట్టేసింది. కాని అదంతా కలతనిద్ర. అర్ధరాత్రి అయేసరికి ఆమెకు మెలకువ వచ్చింది. 'ఏ శ్లైవరూ సాయపడరు. నువ్వే పూనుకోవాలి.' అని ఎవరో చెపుతూన్న ట్లనిపించిందామెకు.

ఆమె వెంటనే లేచింది. తిన్నగా ఎగెయూసు పరుండేగదికి పోయింది. ఎగెయూసు ఉత్తిరోజుల్లోనే గాఢంగా నిద్రపోయేరకం. నాడు చక్రవర్తికి ఏర్పాట్లు చెయ్యడంలో చాలా అలసిపోయిఉన్నాడేమో, ఒళ్లు తెలియకుండా నిద్రపోతున్నాడు.

ఆమె పిల్లిలాగ చప్పుడుచెయ్యకుండా తాళం చెవులకోసం వెతికింది. ఆమెకు వాటిజాడ కనపడలేదు. తలగడక్రింద పెట్టుకునిఉంటాడని తోచి ఆమె మెల్లిగా తన చిట్టి చేతిని తలగడక్రిందకు పోనిచ్చేసరికి తాళాలగుత్తి చల్లగా ఆమె చేతికి తగిలింది. వానికి ఎక్కడ మెలకువవచ్చిపోతుందో అన్న ఆదుర్దాతో ఆమె కొంచెకొంచెంగా తాళాలగుత్తిని పైకి లాగి, మెల్లిగా ఆ గదిలోంచి బయటకు జారింది.

ఒకటీ రెండూ కాదు, బోలెడుతాళాలున్నాయి ఆ గుత్తిలో. అవి చాలా బరువుగాఉండి ఆమె వాటిని రెండు చేతులా పట్టుకుంటేనేగాని మొయ్యలేకపోయింది. ఆమె వాటితో తిన్నగా హర్షప్రియుడు చెరపెట్టబడి ఉన్న గుఱ్ఱపుశాలవద్దకు వెళ్ళి తాళంకోసం తడిమింది.

తాళంచిల్లు పైగా ఉండి ఆమెకు అందిందికాదు. 'పొట్టివాళ్ళకు పుట్టెడుబుద్ధు'లన్నట్లు ఆమెకు వెంటనే ఒక ఉపాయం తట్టింది. పనివాళ్లు తవ్వినమట్టిని తీసుకుపోయేబండి ఒకటి ఆదగ్గరే ఉండి కనపడింది. ఎలాగో శ్రమపడి దాన్ని తలుపువద్దకు లాక్కొచ్చి, ఆమె దానిమీద కెక్కి, తాళాన్ని అందుకోకలిగింది.

కాని ఆ తాళంచెవి ఏదో ఓ పట్టాన్ని ఆమెకు తెలిసిందికాదు. ఆ గుత్తిలో పొట్టివీ, పొడుగువీ, మధ్యరకానివీ చాలా చెవులున్నాయి. ఉజ్జాయింపుగా ఏ రకంవి పడతాయో చూసుకుని ఆ బాపతు ఒక్కొక్క చెవినే పెట్టి చూసింది. ఆఖరికి ఒక పెద్ద చెవి తాళంలో పట్టింది.

కాని అక్కడితో ఆమె శ్రమ తుద ముట్టలేదు. ఆ చెవి తాళంలో పట్టిందేకాని ఆమె దాన్ని తిప్పలేకపోయింది. ఒక చేత్తో తక్కిన చెవులన్నీ ఎత్తి పట్టుకుని రెండో చేత్తో గట్టిగా తిప్పాలి చెవిని. ఆ పని ఆ బాలికకు సాధ్యమైందికాదు.

'ఇంతవరకూ వచ్చి తాళంతియ్యలేకపోతున్నానేమిటి?' అని విచారించింది హెర్మియా. అప్పుడామెకు మళ్లీ ఒక ఆలోచన తట్టింది. ఇలాగే ఒకమాటు తాళం తియ్యలేక హిపోలిటా చెవిరింగులో అట్లకాడకొనను దూర్చి తిప్పింది! అప్పుడు తాళం సులువుగా వచ్చేసింది. ఆ సంగతి జ్ఞాపకంరావటంతోనే హెర్మియా వెంటనే వంటింటిదాకా పరుగెత్తివెళ్లి అట్లకాడను పట్టుకొచ్చింది. హిపోలిటా తిప్పినట్లే ఆ అట్లకాడను పెట్టి బలంకొద్దీ తాళంచెవిని తిప్పేసరికి కిఱ్ఱుమంటూ చప్పుడై తాళం తెరుచుకుంది.

 పాలంకి వెంకటరామచంద్రమూర్తి 

ఆ చప్పుడు వినిపించి ఎవరైనా వస్తారేమో అని ఆమె భయపడింది కాని ఎవరూ రాలేదు. ఆమె మెల్లిగా తలుపు తెరచి లోపల ప్రవేశించి, 'హారప్రియా,' అని పిలిచింది.

కాని ఆమెకు బదులు రాలేదు. ఆ విశాలమైన శాలలో హారప్రియుడు ఎక్కడ పరున్నాడో ఆమెకు మొదట తెలిసిందికాదు. తలుపులు బారుపెట్టేసరికి వెన్నెల లోపల పడి హారప్రియుడు కాళ్లూ చేతులూ ముడుచుకుని దూరంగా ఒకగోడవార నిద్రపోతూన్న సంగతి ఆమె కనిపెట్టింది.

వాని బుజంమీద చెయ్యివేసి లేపబోయింది. హారప్రియుడు ఉలిక్కిపడి లేచి 'ఎవరు?' అన్నాడు. ఆమె, 'నేను; హిరణ్మయిని మెల్లిగా మాట్లాడు.' అంటూ వాని చేతికట్లను విప్పేసి, 'ఎలాగో తాళంతీసి తలుపులు తెరిచాను. త్వరగా ఇక్కడనుంచి పారిపోయి ప్రాణం దక్కించుకో!' అంది.

హారప్రియుడు నిద్రమత్తంతా పోయి ఒక్కగెంతు గెంతి నిలబడ్డాడు. 'నువ్వు ఒక్కర్తెవే వచ్చావా?' అన్నాడు.

'ఔను. ఎగెయూసును సాయపడమని కోరేను గాని లాభంలేకపోయింది. నేనే ఆఖరికి సాహసించాను. ఆలస్యంచెయ్యక త్వరగా మీ గుహ చేరుకో. గాయత్రీదేవి నువ్వెంతకూ రాలేదని బాధపడుతోంటుం దీపాటికి.' అంది హెర్మియా.

హారప్రియుడు ఆలోచిస్తో నిలబడిపోయాడు. 'హిరణ్మయీ! నాకు నువ్వు సాయపడ్డావని తెలుస్తే నీకూ మీ నాయనకూకూడా ముప్పువస్తుంది' అన్నాడు.

'ఏమీ రాదు. నేను సాయపడ్డానని ఎవరికి తెలుస్తుంది? దేవతలు వచ్చి నిన్ను విడిపించుకుపోయా రనుకుంటారు. మీలాంటి మంచివాళ్లని దేవతలు రక్షించారంటే ఎవరైనా నమ్ముతారు.' అంది హెర్మియా.

హారప్రియునకు కృతజ్ఞతతో కళ్లు చెమ్మగిల్లేయి. తనకు సాయపడటానికి ఇంత సాహసంచేసిన హిరణ్మయికి ఏ ఆపదా రాకూడదని వాడు ఆర్యుల దేవతలనందర్నీ ప్రార్థించాడు. ప్రేమతో ఆమె చేతిని పట్టుకుని, 'హిరణ్మయీ!, మా అమ్మకు నువ్వంటే ఎంతో ఇష్టం. ఈ సంగతి తెలుస్తే ఆమె ప్రేమ కింక హద్దుండదు.' అన్నాడు.

వాడూ, ఆమే కొన్ని నిముషాలపాటు అలాగే ఉండిపోయారు. 'నువ్వు త్వరగా పోకపోతే ఈ శ్రమ వృథా ఐపోతుంది' అంది హెర్మియా.

'నిజమే.' అంటూ హారప్రియుడు ఆమెతోసహా శాలలోంచి బయటకొచ్చాడు. వెన్నెలలోంచి నీడలలోకి తప్పుకుని, 'వెడుతున్నాను.' అన్నాడు. వెళ్లనూ లేక ఆగనూలేక కొంతసేపు తచ్చాడి, ఆఖరికి గుండె నిబ్బరంచేసుకుని, చరచరా కోటను దాటి అడవిని ప్రవేశించి అదృశ్యమయాడు.

హెర్మియాకు గుండెపైనుండి పెద్దబరువేదో తీసేసినట్లైంది. ఆమె మెల్లిగా మట్టిబండిని లాక్కుపోయి యథాస్థానంలో పెట్టింది. తాళపుగుత్తిని తీసుకు వెళ్ళి, ఇంకా గుర్రుపెట్టి నిద్రపోతోన్న ఎగెయూసు తలగడక్రిందకు చేర్చింది. ఆ అట్లకాడమటుక్కి ఇంకా ఆమెచేతిలోనే ఉంది. చాలా అలసిపోయిఉండేమో. ఆమె ఆ ఇనపముక్క చేతిలోఉండగానే నిద్రపోయింది.

## 14

తెల్లవారింది. ఎగెయూసు ఖైదీని కాలకృత్యాల నిమిత్తం బైటకు తీసుకొద్దామని తాళంచెవులగుత్తితో అశ్వశాలవద్దకు వెళ్లేడు.

శాలతలుపులు బారెట్టిఉండి, పంజరంలోని పిట్ట పారిపోయిందని తెలవడంతోనే ఎగెయూసుగుండె ఝల్లుమంది!

నౌకర్లలో ఒక్కొక్కణ్ణీ పిలిచి, 'ఏమయాడు ఇండియను?' అని అడిగేడు. 'ఏమో' అన్నారు వాళ్ళంతా. వాళ్ళకేం తెలుసు, ఏం జరిగిందని?

ఎగెయూసుకు బుర్ర కరిగిపోతోన్నట్లుతోచింది. ఇండియను కుర్రవాడు పారిపోయాడని తెలనటంతోనే చక్రవర్తీ, రోహిలసూకూడా మండిపడతారు. తనకు రెక్కలొచ్చి అక్కడనుంచి ఎగిరిపోగలిగితే బాగుండు ననిపించింది. ఆ అడవిలోకి పారిపోతేనో పోనీ? లాభం లేదు; గ్రీకుసైనికులు ఇట్టే వెంటాడి పట్టుకోగలరు. ఆ భగవంతుడే రక్షించాలి. 'దేవుడా, అలెగ్జాండరు చక్రవర్తి ఈ విందుల హడావుడిలో హారప్రియుని మాట మరిచిపోయేటట్లు చెయ్యి!' అని ఆ నిర్భాగ్యుడు ప్రార్థించటం మొదలెట్టేడు.

వాడు ఏడుపుమొహం పెట్టుకుని తనగదిని ప్రవేశిస్తోంటే హిపోలిటా ఎదురై, 'ఏమైపోయిందో అని తెగ వెతికేను. ఆ పిల్ల చేతిలో పెట్టుకు నిద్రపోతోంది దీన్ని!' అంటూ అట్లకాడను చూపించింది.

 

# హిరణ్మయి



బాధలో ఉన్న మనుష్యులు తమకన్నా లోకువైనవాళ్ళమీద చిరాకుపడుతోంటారు. హిపోలిటా ఏమి చెప్పతోందో సరిగా వినిపించుకోకుండానే ఎగెయూసు 'నన్ను విసిగించక నీపని చూసుకో పోయి.' అన్నాడు. హిపోలిటా, 'అంత చిరాగ్గా ఉన్నావేం బాబూ పొద్దున్నే? అట్లకాడ దాచేసి నన్ను ఏడిపించాలని దీన్ని తీసుకుపోయి. హెర్మియాకు నువ్వే ఇచ్చావనుకున్నాను!' అంది.

పొమ్మంటేపోక ఇంకా నిలబడి మాటాడుతోన్నందుకు దానిపైన అతనికి కోపంవచ్చింది. 'నీ అట్లకాడ నేను తియ్యడమేమిటి?' అని కసరబోయాడు. కాని ఆ అట్లకాడను చూడటంతోనే ఎగెయూసు ఆలోచనలో పడ్డాడు. 'హెర్మియా తాళం తియ్యటంకోసం ఈ అట్లకాడను ఉపయోగించలేదుకదా! హరప్రియుణ్ణి వదిలెయ్యమని నిన్న నాతో చెప్పింది... ఈపిల్ల చేసినపనే ఇది. ఎంతకైనా తగినది హెర్మియా! తాళంచెవిని తిప్పలేక అట్లకాడతో సాధించి ఉంటుంది. ఐనా కనుక్కుంటాను.' అంటూ వాడు తిన్నగా హెర్మియాగదికి వెళ్లేడు.

హెర్మియా, దైన్యంతో వచ్చిన ఎగెయూసును చూడటంతోనే వాణ్ణి మాట్లాడనివ్వకుండా తనే, 'ఔను ఎగెయూస్, హరప్రియుణ్ణి వదలిపెడత నేనే! నిన్నిసాయం చెయ్యమంటే చేశావుకాదు మరి. నన్ను రక్షించినవాళ్ళకు నేను ఆపదలో తోడ్పడకపోతే ఎలాగ? నువ్వు నన్నేమన్నా పడతాను!' అంది.

వాడు కోపం, దుఃఖం ముంచెత్తుకురాగా, 'నన్ను నాశనంచేశావు! నా తలపై వెంట్రుకలన్నీ ఒక్కమాటుగా తెల్లపడేటట్లు చేశావు!' అన్నాడు. ఇంకా ఏమనేవాడోగాని అంతలో వాళ్లకి అడుగులచప్పుడు వినపడింది. హెర్మియా హాలులోకి తొంగిచూసేసరికి చక్రవర్తి రోహిలసుతో మాట్లాడుతో ఎదురయాడు. ఆయన హెర్మియాను చూసి, ముద్దుగా బుగ్గపట్టుకుని, "ఏవమ్మా, నిన్నరాత్రి ఏడిచావుకాని ఇప్పుడు సరదాగానే ఉన్నట్లున్నావే? ఏమిటి కథ?" అన్నాడు.

హెర్మియా చక్రవర్తికి వంగి నమస్కరించి, 'ఇప్పుడు సరదాగానే ఉన్నానండి.' అంది.

'ఎందువల్ల? చందమామ నీకు చిక్కిందా?' అన్నాడు చక్రవర్తి నవ్వుతో.

'లేదు ప్రభూ. అందరికీ వెన్నెలనిచ్చే చందమామ ఎత్తుగా ఆకాశంమీద ఉండడమే మంచిది' అంది.

'బలేపిల్ల!...రోహిలస్, మీ అమ్మాయి మంచి తెలివైనదోయ్!' అని మెచ్చుకుంటూ చక్రవర్తి ముందుకు సాగిపోయాడు. రోహిలసు సంతోషంతో చక్రవర్తి ననుసరించి వెడుతో, ఎగెయూసునుకూడా రమ్మని సంజ్ఞచేశాడు. ఎగెయూసు ముళ్ళమీద నడుస్తోన్నవాడికిమల్లే వెళ్లేడు. ఖైదీప్రసక్తి ఎక్కడ వస్తుందో అని ప్రాణాలు 'టువ్వ, టువ్వ' మంటూనే ఉన్నాయి వాడికి. వస్తే ఏమిటిచెప్పడం? 'భగవాన్, ఆ ప్రసక్తిరాకుండా చెయ్యవూ?'అని ప్రార్థిస్తోనే వెళ్లేడు.

మధ్యాహ్నం విందు అయాక విశ్రాంతి తీసుకుని చక్రవర్తి, 'ఇంక మేము వెడతాం రోహిలస్. పరివారాన్ని సిద్ధంగా ఉండమను' అన్నాడు.

రోహిలసు చెప్పకుండా ఎగెయూసు శరవేగంతో వెళ్ళి చక్రవర్తి గుఱ్ఱాన్ని సిద్ధపరిచాడు. చక్రవర్తి రికాబుపై కాలుపెడుతోంటే ఎగెయూసు, 'నేనెంత అదృష్టవంతుణ్ణి! చక్రవర్తి ఖైదీమాట మరిచిపోయాడు. మరోక్షణానికి వెళ్లిపోతాడు! ఆయన వెళ్లేక రోహిలసుతో జరిగినదంతా చెప్పి క్షమార్పణ కోరుకుంటాను. వాళ్ళ అమ్మాయి చేసినపనే గనుక ఆయన క్షమించక పోడు!" అనుకున్నాడు.

కాని ఎగెయూసు తాననుకున్నంత అదృష్టవంతుడు కాదు. ఏమంటే ఆ ఆఖరిక్షణంలో చక్రవర్తికి ఇండియనుబాలునిమాట జ్ఞప్తికొచ్చింది. గుఱ్ఱం ఎక్కబోయినవాడల్లా ఆగిపోయి, 'ఆ ఖైదీని నాముందు పెట్టేరు కాదేమి?' అన్నాడు.

దానితో ఎగెయూసుముఖం వెల్లవూసినట్లైపోయింది. వాడు వణుకుతో, 'ప్రభూ, క్షమించాలి. ఆ ఇండియనుబాలుడు తప్పించుకుపోయి, నా కొంప తీసేశాడు!' అంటూ చక్రవర్తిపాదాలపై పడ్డాడు.

## 15

హరప్రియుడు తప్పించుకుపోయాడనేసరికి అలెగ్జాండరుముఖం కోపంతో ఎఱ్ఱబారిపోయింది. ఆతడు రోహిలసువైపు తిరిగి, 'ఏమోయ్, ఇలాంటి చవటకా ఖైదీని వప్పచెప్పేవు?' అన్నాడు.

రోహిలసు చక్రవర్తికంటే ఎక్కువ ఆగ్రహంతో ఎగెయూసుపైన మండిపడ్డాడు. వాడు తప్పిం

చుకుపోయాడంటే నీబుర్ర పోతుందని చెప్పేకకూడా అశ్రద్ధచేశావన్నమాట! ఇంత దద్దమ్మవని నే ననుకోలేదు! నా పరువు తీసేశావు!' అంటూ నానాచివాట్లూ పెట్టేడు.

ఎగెయూసు, 'ప్రభూ, నేను జాగ్రత్తగానే ఉన్నాను. తాళంచెవులు తలగడక్రింద పెట్టుకుపడుకున్నాను. నాకు తెలవకుండా తాళాలు తలగడక్రిందనుంచి వెళ్లిపోయాయి' అన్నాడు.

'ఎవరు తీశారు? ఆ ఖైదీకి తోడ్పడత ఎవరు? మీవాడా? లేక నా సైనికులలో ఎవడైనానా? చెప్పు! తొక్క చీరించేస్తాను!' అని గర్జించాడు చక్రవర్తి.

ఎగెయూసు మాట్లాడలేదు. 'తాళాలు తీస్త ఎవరో తెలుసా? మాట్లాడవేం?' అని ఉరిమేడు రోహిలసు.

'తెలుసు ప్రభూ.'

'ఎవరో చెప్పు!'

ఎగెయూసు మాట్లాడలేదు, 'మీ అమ్మాయే ఈ పని చేస్త!' అని చెప్పలేకపోయాడు. రోహిలసు తొందరచేసేసరికి వాడు, 'ప్రభూ, క్షమించాలి. నేను ఆ పేరు చెప్పలేను!' అనేశాడు.

దానితో చక్రవర్తికి వళ్లు మండిపోయింది. వీణ్ణి తీసుకుపోయి వెంటనే నేను చూస్తోండగా ఎదురుగా ఉన్న ఆ చెట్టుకొమ్మకు తాడుకట్టి ఉరితియ్యండి!' అని తన సైనికులకు ఆజ్ఞాపించాడు.

ఇంతవరకూ భయంతో వణికిపోతో మౌనంగా గుమ్మంవద్ద నిలబడి చూస్తోన్న హెర్మియా, ఎగెయూసును సైనికులు తీసుకువెడుతున్నారనటంతోనే బాణంలాగ వచ్చి, చక్రవర్తిముందు నిలబడి, 'ఆగండి! ఎగెయూసుది తప్పు లేదు. ఆ తాళాలు తీస్త నేను! హారప్రియుణ్ణి విడిపిస్త నేను!' అంది.

చక్రవర్తి, రోహిలసు, హిపోలిటా, వారేమి, వీరేమి, అక్కడున్నవాళ్లంతా లక్కబొమ్మలకు మల్లే రెప్పవెయ్యకుండా నిశ్చేష్టులై నిలబడిపోయారు. అలెగ్జాండరు తన కండ్లను తానే నమ్మలేకపోయాడు. మరుక్షణంలో హెర్మియా ఆయన పాదాలపై పడి, 'ప్రభూ, ఎగెయూసును వదలండి; ఆ శిక్ష నాకు విధించండి!' అంది.

చక్రవర్తి కోపమంతా పోయి, దిక్కులు మారుమ్రోగేటట్లు నవ్వటం ప్రారంభించాడు. 'నువ్వు చూడబోస్తే లాడికెడు లేవు! ఇంతపని ఎలాగ చెయ్యగలిగేవు? ఎందుకోసం చేసినట్లు?' అన్నాడు.

ఆమె తలఎత్తకుండానే అడవిలో తాను గాయపడి మూర్ఛపోయినప్పుడు హారప్రియుడు తనకు ఏ విధంగా తోడ్పడినదీ చెప్పింది. 'వాళ్ల నివాస స్థానమైన ఈ పుష్కలావతిని ఆక్రమించుకున్న గ్రీకుల పిల్లనని తెలిసికూడా హారప్రియుడూ, అతని చెల్లెలు క్షమావతీ, వాళ్ల తల్లి గాయత్రీదేవీ నన్ను తమ కుటుంబంలోదాన్నిగా చూసి, నా గాయం నయమయాక ఇక్కడకు సురక్షితంగా పంపేశారు. ప్రభూ, విసుజిసు తనకు జరిగిన అన్యాయాన్ని గూర్చి మనవిచేసుకుంటూ అర్జీలు పంపుకున్నాడట. సెల్యూకసు ఆ అర్జీలు ప్రభువులకు అందనివ్వలేదుట.' అని ఆ బాలిక నిర్భయంగా చెప్పేసింది.

'నేను జయించిన ఈ సామ్రాజ్యాన్ని సెల్యూకసు తన దౌర్జన్యంవల్ల పోగొట్టేటట్లున్నాడు చూస్తే!' అన్నాడు చక్రవర్తి. న్యాయం జరపటంలో శత్రువులనీ మిత్రులనీ తేడా చూపరాదన్న చక్రవర్తులలో అలెగ్జాండ రొకడు.

హెర్మియా హారప్రియుణ్ణి చెరలోంచి ఎట్లు విడిపించగలిగినదీ పూసగ్రుచ్చినట్లు చెప్పింది. అలెగ్జాండరు ఆశ్చర్యపోతో, 'అర్ధరాత్రివేళ నీకు భయం వెయ్యలేదా?' అన్నాడు.

'చంద్రుడున్నాడు కదండీ! వెన్నెలలో భయమేమిటి?' అంది హెర్మియా.

'అందరికీ వెన్నెల నిచ్చే చందమామ ఎత్తుగా ఆకాశంమీద ఉండడమే మంచిదన్నావు కదూ, ఇందాకా నాతో? ఇందుకేనన్నమాట! బలేపిల్లవు నువ్వు!' అని మెచ్చుకుంటూ చక్రవర్తి రోహిలసు వైపు తిరిగి, 'ఇంతటి ధైర్యమున్న పిల్లకు తండ్రి వైనందుకు నువ్వు గర్వించాలి!' అన్నాడు. విశ్వజిత్తు అర్జీ మాట జ్ఞాపకంవచ్చి, 'ఐతే, ఈ ఇండియనురాజు ఎక్కడున్నా డిప్పుడు?' అని అడిగేడు.

“'వాళ్లెక్కడున్నదీ ఎవరికీ తెలియనివ్వను' అని నేను గాయత్రీదేవికి మాట ఇచ్చాను ప్రభూ.” అంది హెర్మియా.

'మాట ఇస్తే నిలుపవలసిందే మరి...రోహిలస్, ఈ విసుజిసు ఎక్కడున్నదీ తెలుసుకుని, మళ్లీ ఒక అర్జీ వ్రాయించి మాకు పంపు. జరుగవలసిన న్యాయాన్ని తప్పక జరిపిస్తాము. మేము మాసిడోనియా చేరు

# ఆదిమమానవుని ఆయుధరాజము

అదొక కొండగుహ. ద్వారంవద్ద మోహా కూర్చుని ఎదురుగా కనిపించే చక్కని ప్రకృతి దృశ్యం చూస్తున్నాడు. గుహకు కొంచెం దూరంలో అరణిశిలలూ, గండశిలలూ, బండరాళ్లూ ఉన్నాయి. వాటిమీద ఒకతొండ పరిగెత్తుతూ, గెంతుతూ ఆడుతోంది.

అది మధ్యాహ్నసమయం. ఎండ తీక్షణంగా ఉంది. ప్రాణులన్నీ ఏ చెట్టునీడనో, రాతినీడనో చేరి కూచుంటున్నాయి. అవి మానవజాతి ఆవిర్భవించిన కొత్తరోజులు. అప్పటి మనుషులు గుహల్లోనో, చెట్లమీదనో నివసించేవారు. భాష ఇప్పటిలాగ అభివృద్ధికాలేదు. వస్తువులపేర్లుమాత్రమే వాడుకలో ఉన్నాయి. ఆ పేర్లతోనే ఒకరి అభిప్రాయం ఒకరు తెలుసుకునేవారు. మోహా వాళ్ళ అమ్మదగ్గిరికి వెళ్లి "అన్నం" అనేవాడు. అంటే "భోజనం తయారుచేశావా? నాకు ఆకలిగా ఉంది," అని అర్థం. ఒక్కొక్కమాట నేతప్ప అనేకమైన మాటలతో సంభాషించుకోవడం అప్పటివారికి తెలియదు.

మోహాను ఇప్పుడు మీరుచూస్తే చాలా విచిత్రమైన జంతువు అనిపిస్తాడు. పన్నెండేళ్ళబాలుడైనా పదేనిమిదేళ్ళ బాలుడంత ఎత్తూ, లావూమాత్రమేఉన్నాడు. ముఖానా అరిచేతిలోనూ, అరికాలులోనూ, తప్ప మిగతా ఒళ్లంతా నూనూగు రోమాలు ఉన్నాయి. కళ్లు బాగా చిన్నవి; అవైనా లోతుగా, దగ్గిరదగ్గిరగా ఉన్నాయి. ముక్కు వెడల్పుగా, చప్పిడిగా ఉన్నది.

చిన్నవాడుగా కనిపించినా మోహా మంచిబలశాలి. ఇప్పటి మనుషులకంటె ఎక్కువ దూరం దూకగలడు ఎక్కువవేగంగా పరుగెత్తగలడు. ఎటువంటి చెట్టునైనా సులభంగా, త్వరగా ఎక్కగలడు. ఎటువంటి నేలమీదైనా వేగంగా పరుగెత్తగలడు. కాలివేళ్లతో పట్టుకుని తలకిందులుగా చెట్టుకొమ్మనుండి ఎంతసేపైనా వేళ్ళాడుతూ ఉండగలడు.

మోహాపక్కన అతని చెల్లెలు సీనా కూర్చుని కునికిపాట్లు పడుతోంది. అప్పుడప్పుడు కళ్లుతెరిచి అన్నకేసిచూసి, ఒకసారి చుట్టూ కలయచూసి మళ్ళీ కునికిపాట్లు పడుతోంది. ఆమెకళ్లు పెద్దవి, చురుకైనవి, అందమైనవి.

చివరికామె లేచి, కళ్లు నులుముకొని, అన్నని బుజంమీద తట్టింది. "ఏమిటి మోహా! ఇందాకటినుంచి ఆలోచిస్తున్నావు?" అని అర్థంవచ్చేటట్లు ఒకముక్క ఏదో అన్నది.

మోహా జవాబివ్వలేదు. పక్కన ఒక కర్రఉన్నది. దానికి ఒక కొన చాలా వాడిగా వున్నది. అది తీసి, తనకేసి తేరి పారచూస్తున్న తొండమీదికి రయ్యిన విసిరేశాడు. సీనా కిలకిల నవ్వింది.

సూర్యుడు పడమటిదిక్కుకు తిరిగాడు ఇప్పటి కాలమానంప్రకారం సాయంత్రం నాలుగుగంటలవుతుంది. మోహా సీనాను వెంటబెట్టుకుని తను కర్రవిసిరిన చోటికి వెళ్లాడు. అతనికర్ర తొండకు తగలలేదుగాని, ఒక అరణిశిలకు తగిలింది. ఆ శిలలో ఒక చిన్న రంధ్రం ఉన్నది. అందులో కర్ర ఇరుక్కుని ఉంది. అందులో అది ఎలా గుచ్చుకున్నదా అని అతనికి చాలా ఆశ్చర్యం కలిగింది.

ప్రపంచంలోకల్లా మొట్టమొదటి గొడ్డలి ఈవిధంగా తయారైంది. కాని అది గొడ్డలి అని, దాన్ని ఆయుధంగా ఉపయోగించవచ్చునని మోహాకు తెలియదు. అరణిశిలను తీసి పారవెయ్యడానికి మోహా చాలా ప్రయత్నించాడు. కాని కర్ర అందులోంచి ఊడి రాలేదు. ఇక కర్ర పనికిరాదని దాన్ని పైకెత్తి

 హిరణ్మయి 

కున్నాక మా విజయాన్ని తెలపటానికని గొప్ప ఉత్సవాలలో పాల్గొనటానికి నువ్వు మీ అమ్మాయిని తీసుకుని రావాలి. మీ పిల్ల మా మెప్పు సంపాదించింది గనుక ఉత్సవంలో మహారాణితో బాటు రథంలోవచ్చే అధికారం ఈమెకు ప్రసాదించాము.' అని గుఱ్ఱమెక్కి పరివారంతో వెళ్లిపోయాడు. చచ్చిబ్రతికిన ఎగెయూసు హెర్మియాను యెత్తుకుని నాట్యం చెయ్యటం ప్రారంభించాడు.

(ఇంకా వుంది.)

గిరగిర తిప్పి పారవేయబోయాడు ఇంతలో అతనికి మెరుపులాగ ఒక ఆలోచన తట్టింది, దాన్ని ఆయుధంగా ఉపయోగించవచ్చునని. అలా గిరగిర తిప్పుతూనే దాన్ని ఒక ఎండుకొమ్మమీద కొట్టాడు. అన్నివేపులా పదునుదేరి వాడిగా కత్తిలాగఉన్న అరణిశిల కొమ్మను తునాతునకలుగా తెగగొట్టింది. అన్నా, చెల్లెల్లిద్దరూ క్షణంసేపు దిగ్భ్రాంతులైపోయారు ఈ వింత చూసి.

కొంతసేపైన తరవాత మోహా, సీనాను వెంటతీసుకుని, తాము నివసించే గుహాలకు దూరంగా ప్రవహించే చల్లని, తియ్యని సెలయేటికి బయలుదేరాడు. సాయంకాలం పూట అలా నడిచి సెలయేటికి వెళ్లి, మంచినీళ్లు తాగిరావడం మోహా, సీనాలకి, వారి తల్లిదండ్రులకీకూడా అలవాటు. ఆవేళ పిల్లలిద్దరూ మాత్రమే బయల్దేరాను.

మోహా ముందు నడుస్తున్నాడు. సీనా వెనకనడుస్తున్నది. హఠాత్తుగా ఆమె "హుష్" అని ఆగిపోయింది. దాపున అపాయముంటే, పసిగట్టడంలో ఆమె అన్నకంటే నేర్పరి. ఆమె ఆగిన మరుక్షణంలో మోహా కూడా అపాయం పసిగట్టాడు. గభాలున మెరుపులాగ పరిగెత్తి, దగ్గర్లో ఉన్న చెట్టుఎక్కి చిరారు కొమ్మకు ఎగబాకాడు.

అదే క్షణంలో సీనాకూడా ప్రాణరక్షణార్థం ఇంకో చెట్టెక్కింది. ఆడపిల్లఅయినా, అన్నవలెనే ఆమెకూడా చెట్లు ఎగబాకడంలో నేర్పరి కన్నుమూసి కన్ను తెరిచేటంతలో ఇద్దరూ చెట్లెక్కిపోయి అపాయంనుండి తప్పించుకున్నారు.

ఇంతలో దట్టమైన పొదరింటి నుండి మహాభీకరమైన వ్యాఘ్రరాజం ఒకటి దూసుకుని వచ్చింది. సీనా ఎక్కినచెట్టుకిందనే నిలబడి పైకి చూచింది. ఆమె ఎక్కిన చెట్టు తాటిచెట్టు కాదుగాని, కొమ్మలులేకుండా చాలా ఎత్తుగా పెరిగినకారణాన అలాగే ఉన్నది. దానిమీదికి ఎగరడము అసాధ్యమనుకున్నదో ఏమో, పెద్దపులి మోహాఎక్కిన చెట్టుకిందికి వచ్చింది. మోహా చేతులో గొడ్డలితో అలాగే కొమ్మను అంటిపెట్టుకుని కూర్చున్నాడు.

అతడు ఎక్కినచెట్టు కొంత దూరంపోయాక, రెండు పెద్దకొమ్మలుగా-చీలిపోయి పెరిగింది. అందులో ఒక కొమ్మకు చివర మోహా కూర్చున్నాడు. పెద్దపులి హుమ్మని గర్జిస్తూ పైకెగిరింది. కాని చెట్టు చీలినచోటువరకూ ఎగరలేకపోవడం మూలాన, పట్టుదొరక్క, జారిపోవడం మొదలుపెట్టింది. అలా జారిపోతూపోతూ, ఒకచోట ఏదో ఆధారం దొరకడంవల్ల దాన్ని పట్టుకుని ఒకనిమిషం వేలాడింది. ఇంతలో దానికాళ్లు మరొక ఆధారం చూసుకుని చెట్టుమీద నిలిచాయి.

ఆవిధంగా ఆసరా చూసుకుని పెద్దపులి నెమ్మదిగా చెట్టుపైకి పాకడం మొదలెట్టింది. చివరికి అది చెట్టు రెండుగా చీలినచోటికి చేరుకున్నది. మోహా ఎక్కినకొమ్మ నిలువుగా ఉన్నది. దానిమీదికి పాకడం చాల కష్టమైనపని. అదీగాక ఆకొమ్మ సన్నగా ఉండటం చేత పెద్దపులిబరువు అది భరించలేక విరిగేదికూడాను.

అందుచేత పెద్దపులి ఏంచేయడానికీ తోచక అక్కడే ఉండి మోహాను తీవ్రకోపంతో చూచింది దానికళ్లలో ప్రజ్వలించే పగచూసేసరికి మోహాకు విపరీతమైన భయం కలిగింది. చేతులు పట్టుతప్పి కింద పడిపోవలిసినవాడే. కాని మళ్ళీ ధైర్యం తెచ్చుకుని కొమ్మను ఇంకా గట్టిగా పట్టుకున్నాడు.

ఇదంతా పక్కచెట్టుమీదఉన్న సీనా చూస్తూనే ఉన్నది. అన్న ఏమైపోతాడో అనేభయంతో ఆమె గజగజవణికిపోతున్నది అయితే అన్నఉన్నచోటికీ, పులిఉన్నచోటికీ దూరం చాలా ఉన్నది. అందుచేత పులి ఎంత ప్రయత్నించినా అతన్ని సమీపించలేదు. "మోహా! పరవాలేదు. పులి నీదగ్గిరికి రాలేదు" అని



హైజంప్ ఫొటో : ఎస్. గిరిధర్ —మద్రాసు.

అర్థంవచ్చేమాట ఏదో ఆమె అరిచింది.

అప్పుడు మోహా కిందికి చూశాడు. పులి చాలాదూరంలో వున్నది. అందుచేత ప్రాణాలకు భయంలేదు. కనుక ఇంకేమీ ఫరవాలేదనుకుని 'హోహోహో!' అని బిగ్గరిగా నవ్వాడు. "పాపం పులి నన్ను తినేద్దామనుకున్నది. కాని దానికివ్వాళ పస్తే" అన్నాడు. సీనా అదివిని తనుకూడా పగలబడి నవ్వుతూ "అవును, పస్తే!" అని అరిచింది.

ఇలా నవ్వడంచూసి పెద్దపులికి వొళ్లు మండుకుపోయింది. న్యాయంగా తనకు ఆహారంకావలసిన ఈ మనుషులిద్దరూ, తనకు అందకుండా తప్పించుకుపోవడమే గాక తన్ను వేళాకోళంచేస్తున్నారని దానికి తెలిసిపోయింది. మోహా అక్కడితో ఆగక మరో తెలివితక్కువపనిచేశాడు. ఒక ఎండు రెమ్మ విరిచి పులిమీదికి విసిరాడు. పులికి మరీ మండిపోయింది. వెంటనే పంజాలు రెండూ ఎత్తి మోహాఉన్న కొమ్మను మోదింది. ఆ దెబ్బకు కొమ్మ పైకీ కిందకీ ఊగిసలాడిపోయింది. కాస్తవుంటే మోహా కింద పడిపోయేవాడే. గట్టిగా పట్టుకున్నాడు, గనక సరిపోయింది.

పెద్దపులి కోపంతో మరేమీ చెయ్యలేక అదేపనిగా, మళ్ళీమళ్ళీ కొమ్మను బాదసాగింది. కొమ్మతెగ ఊగిపోతోంది. ఆ ఊపులతో మోహా కిందికీ పైకీ ఊగుతూ, పడిపోవడానికి సిద్ధమౌతున్నాడు. అలా ఎంతోసేపు పట్టుకొని ఉండడం అసాధ్యమనీ, తాను విసిరివేయబడడమో, లేక కొమ్మ విరిగిపోవడమో తప్పదనీ అతనికి తెలుసు.

(46-వ పేజీ చూడండి)

చైనీస్ కథలు - ఫెంగ్‌స్వే ఫెంగ్ :

# 12. స్వార్థంలేని సామ్రాజ్యవాది

చెవుల పిల్లుల రాజ్యంలో ఒక నక్క అడుగు పెట్టింది. అదేం పాపమో, నక్కను అల్లంత దూరాన చూసేటప్పటికే చెవుల పిల్లులన్నీ ఎక్కడివక్కడ చెల్లాచెదరై పోయాయి. అలా పారిపోతే ఎంత మంచి వాళ్లకైనా కోపం రాదూ? అందుకని నక్క వాటి వెంటబడి తరిమి, దొరికినన్నిటిని పట్టుకుని, వీలైనన్నిటిని చంపి, కడుపు పట్టినన్ని తిన్నది.

నక్క ఏదో దయ తలచి చెవుల పిల్లుల్ని తినేసిందిగాని, లేకపోతే ఆ రాజ్యం ఎంత అరాజకంగా వుండేదో. అంతవరకూ కలకలలాడుతో, బిలబిలలాడుతో, గందరగోళంగా ఉన్న చెవులపిల్లులరాజ్యం ఇప్పుడు హాయిగా, ప్రశాంతంగా, శ్మశానం లాగ నిశ్శబ్దంగా ఉన్నది. తను చేసిన ఘనకార్యానికి నక్క ఎంతో సంతోషించినదై "ఇప్పుడు చూడు ఎంత బావుందో, ఈదేశం! ఆహా, ఏమి యీ ప్రకృతి రామణీయకం! ఏమి ఆహారసమృద్ధి! ఎంత మంచి ప్రజలు!" అనుకున్నది.

కొంచెంసేపు అలా అలా తిరిగింది. ఎక్కడా అలికిడిలేదు. విసుగు పుట్టింది. "అబ్బే, ఏం బాగాలేదు" అని నిట్టూర్చింది "ఎక్కడా ప్రాణి సంచలనం లేదేం భ్రాంతిగా? దేశమంతా పాడుపెట్టేసినట్లయింది! ఎక్కడ చూసినా మృత కళేబరాలూ, ఎముకలూ! అంతా సర్వనాశనమై పోయింది. శవాలుచూడు, దిక్కూ మొక్కూ లేకుండా పడివున్నాయి!"

నక్కది అసలే దయార్ద్ర హృదయం. ఆ శ్మశాన దృశ్యం చూసి దాని హృదయం మంచులా కరిగిపోయింది. వెంటనే చెవులపిల్లుల ఎముకలన్నీ పోగుచేసి గొయ్యి తవ్వి పూడ్చి పెట్టింది. తలపంకించి తన మంచితనానికి తనే ఇదైపోయి, "ఎవరూ లేక పోబట్టి నన్ను నేనే అభినందించుకోవల్సి వస్తోంది. ఇంకోళ్లయితేనా, ఈపాటికి నాకు బ్రహ్మరథం పట్టి ఉందురు. పాపం ఈ శవాలన్నిటిని నేను కాకపోతే ఇంకెవరు పాతిపెడతారు? ఈ ప్రజలకి అంత్యక్రియలకి కూడా దిక్కులేకపాయె!" అని చింతించింది. సమాధిదగ్గర ఒకబల్ల కట్టి, దానిమీద "ప్రజలను కన్నబిడ్డలవలె పాలించిన ప్రభుత్వానికి ఇది స్మారక చిహ్నం" అని వ్రాసింది.

"ఏదో చెయ్యగలిగినదంతా చేశాను. ప్రజలను కంటి రెప్పలవలె కాపాడాను. ఇంతా చేసి, నావెంట ఏమన్నా పట్టుకుపోతున్నానా? లేదు. పూచీపుల్లకూడా పట్టుకుపోవడంలేదు. ఆహా! నేనెంత స్వార్థరహితుణ్ణి" అని ముచ్చటపడుతూ నక్క తనదారిని తాను పోయింది. 

పోని మరో కొమ్మమీదికి దూకుదామా అంటే, అవతలఉన్న రెండోకొమ్మ అతను దూకితే ఆగ లేదు. అందుచేత కొన్ని అడుగులు దిగివచ్చాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. పులి అదేవిధంగా కొమ్మను కొడుతూ ఉంది. దాని భయంకరాకారం, అరుపులూ మోహాను భయభ్రాంతుణ్ణి చేస్తున్నాయి.

ఆఖరికి ఇదేం లాభం లేదనుకున్నాడు. ఎలాగూ చావు తప్పదని తెగించాడు. 'పెద్దపులిమీద ఒకదెబ్బతీసి మరీ దాని నోట్లో పడదాం' అనుకున్నాడు.

రెండుచేతులతోనూ గొడ్డలి పట్టుకుని, నెమ్మదిగా కొమ్మమీద జరుగుతూ, జరుగుతూ పెద్దపులిని సమీపించాడు.

మోహా అంత ధైర్యంగా తన్ను సమీపించడం చూసి పెద్దపులి ఆశ్చర్యంతో కొమ్మను మోదడంమానివేసి అతనివంక తేరి చూడసాగింది. మోహా మెరుపు వేగంతో గొడ్డలిని గిరగిరతిప్పి కొమ్మమీద ఆన్చిఉన్న పెద్దపులి పంజామీద కొట్టాడు.

అరణిశిల అంచులు కత్తిలాగ పదునుగా ఉంటాయని ఇదివరలో తెలుసుకున్నారుగదూ. అందుచేత, దెబ్బ పడీ పడడంతోనే ఎముక, కండరంతోసహా పంజా సర్రున తెగిపోయింది. గొడ్డలి కొమ్మలో అర అంగుళంలోతున దిగబడింది కూడాను. పెద్దపులి బాధతో పెద్ద పెట్టున గాండ్రిస్తూ, ఎగిరి కింద పడిపోయింది.

"పెద్దపులి చచ్చింది! చారలపులి చచ్చింది!" అని నీనా సంతోషంతో చప్పట్లు కొట్టింది.

పెద్దపులి నిజంగానే చచ్చింది. కిందపడడంలో ఒక కొమ్మమీద పడి, నడుము విరగ్గొట్టుకుని మరీ కిందపడింది. అంతఎత్తునుంచి కింద పడితే ఇంకేముంది? చచ్చి ఊరుకుంది.

ఈవిధంగా చరిత్రలో మొదటి సారిగా ఒకబాలుడు గొడ్డలి సహాయంతో మానవజాతి శత్రువైన పెద్దపులిని జయించాడు.

(ఆంగ్ల కథ ఆధారం)

★

## కాకీ, కథకుడూ

(11-వ పేజీ తరువాయి)

"ఆ పక్కనున్న వాణ్ణి చూడు. అచ్చు బూచాడులా వున్నాడు."

"బూచాడులా వుంటే ఏం రా బలే ధాన్సు కొట్టేడు."

మానవుని సంస్కారం శతవిధాల ప్రకటితమాతూంది. కాకి అంతా కనిపెడుతూనే వుంది. రంగడి మొహంలో కళంతా మంత్రం వేసినట్లు మాయమైపోయింది. ఉక్కిరి బిక్కిరైపోతున్నాడు, కథకుడు ఆశ్చర్యంతో చూస్తున్నాడు.

"ఒరేయ్ చూశావురా?"

"ఏమిటి?"

"ఆ అబ్బాయి మా కజిన్ బ్రదర్ రా."

"అలాగా...?"

"ఆ అమ్మాయి మా - మా..." తడబడుతున్నాడు రంగడు.

"చెల్లెలు గాబోలు పాపం!..."అర్థం చేసుకుంది కాకి.

"అన్నా చెల్లెలు కలసి వెళ్తున్నంత మాత్రాన మన వెధవలు విసిరే మాటలు చూశావా?"

కథకుడు మాట్లాడలేదు.

"అయినా వాళ్ళ ననడమెందుకులే. అసలు లోకమే అంత. పాడులోకం. అంతా కాకిలోకం.." కడుపుమంట కక్కాడు రంగడు.

కాకి కొవ్వుమంది. రంగడు తల పైకెత్తాడు. పైకి చూస్తున్న రంగడి మొహంబదే ట్లు గురిచూసి రెట్టవేసింది కాకి. రెక్కలు విప్పి ఎగిరిపోయింది.

కలిసి కట్టుగా ఎగిరిపోతున్న కాకిమూక వైపు కనురెప్ప వాల్చకుండా చూస్తూ నిలబడి పోయాడు కథకుడు.

★





జపాన్ కథ:

# జననమరణాలు

మూలం : ఎస్. కటో  అనువాదం : కె. రామచంద్రరావు



చాలాకాలం క్రిందట జపాన్‌లో సెంటారో అనే ధనవంతుడు ఉండేవాడు. అతను మహాసుఖంగా జీవితం వెళ్ళబుచ్చుతుండగా ఉన్నట్టుండి ఒకనాడు చచ్చిపోతానేమోననే భయం పట్టుకుంది. అప్పటికి అతని వయసు ముప్పై సంవత్సరాలు. ఈ విషయాన్ని గురించి అతనెంతగా ఆలోచించేవాడో అంతగా భయపడుతూ వుండేవాడు. పుట్టినవాడు గిట్టక మానడని అతనికి తెలుసు. కాని ఆరోజు వచ్చి తనమీద ఎప్పుడు పడిపోతుందోనని అతని ఆందోళన. ఈ ఆందోళన అతనిని పిచ్చివాన్ని చేసి వేసింది.

పాతకాలపుకథల్లో కొందరు కొన్ని వందల సంవత్సరాలు బ్రతికి వున్నట్టు అతనికి తెలుసు. అయితే ఆకాలంలో అన్ని వందల సంవత్సరాలు బ్రతక వీలుంటే మరి ఈరోజున లేదా? కాని ఈనాటి జీవితవిధానంలో ఏదో తప్పు ఉండి వుంటుందని అతని విశ్వాసం. తను ఈ బెడదను తప్పించుకోవడంకోసం తన శక్తినంతా వినియోగించ కృతనిశ్చయుడైనాడు.

ఇతనిలా ఆలోచిస్తూ ఉండగా ఒకరు అతనికి చైనారాజు షిన్ నో షికోపై కథను చెప్పారు. ప్రసిద్ధ ప్రాచీనచైనారాజులలో అతనొకడు. సెలేస్టియల్ రాజ్యంలోని 'గ్రేట్ వాల్'ను అతనే కట్టించాడు. ధనధాన్యాలతో, భోగభాగ్యాలతో తులతూగుతున్నా మరణ భీతితో సతమతమవుతూ వుండేవాడు. తూర్పుసముద్రంలో హోరెయిజాన్ అనే ద్వీపం ఉన్నట్టున్నూ, అక్కడ అమృతం దొరుకుతున్నట్టున్నూ అతను విన్నాడు. విని తన ఆస్థాన సేవకుడు 'జోఫుకూ' అనేవాన్ని అందుకోరకు పంపించాడు.

హోరెయిజాన్ చేరీ చేరగానే జోఫుకూ కొంతమంది ఋషిపుంగవులను కలుసుకున్నాడు. వారికి అనంతమైన జీవితవిధాన రహస్యాలు తెలుసు. ఏ కారణంవల్లనో జోఫుకూ తన దేశం తిరిగి పోలేదు. నిరీక్షిస్తున్న రాజును చేరలేదు.

అప్పటి హోరెయిజాన్ ద్వీపమే నేటి జపాన్ అనీ, జోఫుకూ ఇంకా ఆ ఎత్తైనపర్వతాలలో దేనిమీదనో ఉండిఉంటాడనీ అతనికి ఇప్పటికీ మూడువేల సంవత్సరాలకు మించిన వయసుంటుందనీ సర్వత్రా నమ్మబడుతూవుంది. అందుకనే నేటికీ జపాన్‌లో అనేక పవిత్రస్థలాల్లో జోఫుకూ సుదీర్ఘ జీవనప్రదాతగా ఆరాధింపబడుతున్నాడని వారి నమ్మకం.

ఈ కథను విన్నాడు సెంటారో. అమృతంకోసం అన్వేషణ ప్రారంభించాడు. జోఫుకూ బ్రతికివుండే పక్షంలో ఆ ఉన్నతపర్వతశ్రేణుల్లోని పవిత్రమఠాలలో ఎక్కడో ఒకచోట కలిసికోగలనని అతని ఆశ.

పర్వతప్రాంతాలన్నీ తిరిగితిరిగి చివరకు పవిత్ర జపాన్‌లోని ప్రసిద్ధికెక్కిన జోఫుకూ మఠానికి చేరాడు సెంటారో. అక్కడ అతను ఏడు దివారాత్రాలు ఏకదీక్షతో భగవంతుని ప్రార్థించాడు. సంజీవి ఎక్కడ లభ్యమవుతుందో తెలియచెయ్యమని అర్థించాడు.

ఏడవరోజు అర్థరాత్రి సెంటారో ప్రార్థనలో వుండగా జోఫుకూ లీలగా ప్రత్యక్షమైనాడు.

"చాలారోజులుగా నువ్వు చేస్తున్న ప్రార్థనలను ఆలకించాను. అమృతం అనేది ముఖ్యంగా ఋషీశ్వరులకే ప్రత్యేకించబడింది. నీలాంటి సామాన్యమానవులకు అది లభ్యం కాదు. కాని నీకు మరోవిధంగా సహాయపడతాను. నిన్ను చిరంజీవులు నివసించే దేశానికి పంపిస్తాను. అక్కడివారందరు ఎప్పుడూ బ్రతికే వుంటారు" అని చెప్పి కాగితంతో తయారుచేయబడిన ఒక కొంగను ఇచ్చి అదిఎక్కి వెళ్ళమన్నాడు.

సెంటారో ఆనందోత్సాహంతో "నేను భయంకరమైనసన్యాసిగా బ్రతకనక్కర్లేదు. చిరంజీవుల దేశంలో నిశ్చింతగా బ్రతికే అవకాశం తొందరలోనే లభించింది" అనుకున్నాడు.

తను కోరినదానికంటె ఎక్కువ ఫలితమే లభించింది. అందుకని అతను భగవంతునికి పదే పదే ప్రణామం చేశాడు. ఇంతలో ఆ కాగితపు కొంగ అతను సుఖంగా దానిపైకూర్చుని ప్రయాణించడానికి అనువుగా అంతంతగా పెద్దదైంది. అతను దానిపై ఆసీనుడైనాడు. అది రెక్కలను బారచాపి, అంతరిక్షానికి ఎగిరి, పర్వతాలను, నదీనదాలను, సముద్రాలనుదాటి వేలకొలదిమైళ్ళదూరంపోయి ఒక్క

ద్వీపాన్ని చేరింది. సెంటారోదాని నుండి దిగి దిగడంతో ఆ కొంగ తనకు తానుగా ముడుచుకు పోయి తన యథార్థరూపాన్ని పొంది సెంటారోచొక్కా చేతిలోకి దూరి పోయింది.

ఆ దేశం ఎంతో అందంగాను, సారవంతంగాను కనిపించింది అతనికి. కాని ఎక్కడా సాగు చేస్తున్న లక్షణాలు లేవు. ఆ పట్టణాలు, పల్లెలు జనసమ్మర్దంగా వున్నాయి. కాని ఆ ప్రజలంతా సోమరుల్లావున్నారు. అతను అలాగే ఒకపట్టణంలోకి వెళ్లాడు. అక్కడి ప్రజలు ఎంతో ఆదరంతో అతనికిస్వాగతమిచ్చారు. వారు అతనిని మొదటగా అడిగిన ప్రశ్న ఏమిటంటే తనవెంట విషపూరితమైన మందును దేనినైనా తెచ్చాడా అని. ఈ ప్రశ్న సెంటారోను ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. అతను అటువంటిమందును దేనినీ తేలేదనిచెప్పగానే వారందరూ నిరుత్సాహపడ్డారు. కాని ఆ వ్యక్తి జపాన్‌నుంచి వచ్చాడని అక్కడి ప్రజలు వార్ధక్యంవల్ల మరణిస్తారని వారు తెలుసుకొని కొద్దిగా సంతోషించారు. చనిపోవడమనేది ఎలా వుంటుందో తెలుసుకోవచ్చుననేదే వారిసంతోషానికి కారణం. ఆ సంతోషంతో వారు అతనికో మంచిబంగళాను ఇచ్చారు. మరణం గురించి చెప్పే గురువుగా గౌరవించ మొదలుపెట్టారు.

అక్కడి ప్రజలకు జ్ఞాపకమున్నంతవరకు ఏ ఒక్కరూ ఇంతవరకు రోగంతో బాధపడలేదు. చనిపోలేదు. మరీ వింత ఏమిటంటే సెంటారోలాగ, ఇంకా ఇతర సామాన్యమానవుల్లాగకాక అక్కడి వారు చచ్చిపోవాలని కోరుతుంటారు. అది మంచిదనీ, కావలసిందనీ వారి అభిప్రాయం.

నిజానికిచూస్తే అక్కడి ప్రతి విషయం తలక్రిందులుగా సెంటారోకి కనబడింది. సెంటారో ద్వేషించేది వాళ్ళకు ప్రియమవుతుంటుంది. అతను ఆనందించేదానిని వాళ్లు తృణీకరిస్తారు.

ఎవరైనా వర్తకుడు విషసంబంధమైన మందులని అమ్మితే తమవద్దనున్న డబ్బునంతా పెట్టికొంటారు. అయితే ఆ మందులు వాళ్ళ ఆరోగ్యాన్ని చెడకొట్టకపోగా మరింత బలాన్ని చేకూరుస్తాయి. వాళ్లు చిరకాలం జీవించివుండడం, మార్పు లేకుండా వుండడం భరించలేకుండా వున్నారు సహించలేకుండా వున్నారు వాళ్ళకాశక్తివుంటే తమ తమ జీవితాలను మూడు నాలుగు వందల సంవత్సరాలు తగ్గించుకుని వుండేవారు. ఇంక చచ్చిపోము అనే విషయం వారిని నిరంతరం బాధిస్తూ వుంది.

వారికి వార్ధక్యంరాదు కనుక అప్పుడు వినియోగించుకునేందుకు డబ్బును నిలవచెయ్యనక్కర్లేదు. జబ్బు చేస్తుందనిగాని, ప్రమాదం వాటిల్లుతుందనిగాని భయం లేదు కనుక చాలానిర్లక్ష్యంగాను, నిర్లిప్తంగాను వుంటారు. వ్యాపారంలేదు. పరిశ్రమలు లేవు. అభివృద్ధి లేదు. పురోగతి లేదు. వందసంవత్సరాల క్రితం ఎలావుందో ఈనాడూ అలానే వుంది. వాళ్ళకు కాలగతితో సంబంధంలేదు. అభ్యుదయం అనే మాటను వారు విననేలేదు. వారికి తెలియనే తెలియదు. మార్పులేక, పురోగమనం లేకపోతే ఆనందం ఎలా సాధ్యమవుతుంది. నిజంగా ఈ విశాలవిశ్వంలో సౌఖ్యం లేనివాళ్లు వాళ్లే!

కాని సెంటారోకి ఆనందమైంది. ఆ ద్వీపం మొత్తంమీద సుఖజీవి అతనొక్కడే! "ఈజీవితంవల్ల అలసిపోను. నేను వేలకొలది సంవత్సరాలు జీవించి వుండాలనీ, ఆనందాన్ని అనుభవించాలనీ కాంక్షిస్తున్నాను." అని అనుకొనేవాడు. అతనికి సాధకబాధకాలేమీలేవు. మూడువందల సంవత్సరాలు గడిచేసరికి మహాధనవంతుడైనాడు.

అలానే సంవత్సరాలు గడిచిపోతున్నాయి. ఏకాకిగా వుంటున్నట్టు అనిపించింది. బాగా డబ్బు చేరింది. యవ్వనంలో వున్నాడు. ఎంతో దీర్ఘకాలం జీవించాడు కాని జీవితం ఎప్పుడూ ఒకేలాగ వుంది. దానిలో మాధుర్యమూ లేదు.

మార్పూ లేదు. ఈజీవితంతో అతను విసిగిపోయాడు. తన దేశం ఎప్పుడు పోతానా, అక్కడి మార్పులనూ, చేర్పులనూ ఎప్పుడు చూస్తానా అని అతను ఉవ్విళ్లూరుతూ వుండేవాడు.

చివరకు సెంటారో తనకు ఈ చిరకాల జీవిత ప్రదాతఅయిన జోఫుకూను స్మరించి తన దేశానికి తనను చేర్చమని ప్రార్థించాడు.

అతను అలా ప్రార్థించాడో లేదో వెంటనే అతని చొక్కా చేతులనుంచి కాగితపు కొంగ రెక్కలను విదల్చి, విప్పుకుంటూ వచ్చి చూస్తూండగానే పెద్దదైంది. సెంటారో దానిపై అధిష్టించాడు. అది ఆ వెంటనే నింగికెగసి పర్వతాలనూ, సముద్రాలను దాటుతూ జపాన్ మార్గం పట్టింది.

మార్గ మధ్యంలో ఒక పెద్ద ప్రమాదం సంభవించింది. పెను తుపాను రేగింది. కాగితపు కొంగ తడిసిపోయి, ముద్దయిపోయి, ముడుచుకుపోయి సముద్రంలో పడిపోయింది. సెంటారో మునిగిపోనుండిన సమయంలో భయకంపితుడై జోఫుకూను రక్షించమని అర్థించాడు. కాని అతనికి సహాయపడేందుకు జోఫుకూ రాకపోగా అతనిని భక్షించేందుకని ఒక పెద్ద సొఱచేప ప్రత్యక్షమైంది. భయంతో వణికిపోతూ, నిరాశ, నిస్పృహ ముప్పిరిగొనగా బిగ్గరగా "జోఫుకూ రక్షించు! జోఫుకూ రక్షించు" అని అరిచాడు.

ఆ అరుపులతో అతను నిద్ర లేచాడు. మొదట్లో జోఫుకూను ప్రార్థిస్తూఉండగానే అతనుమైమరచి నిద్రలో మునిగిపోయాడు. అటు పిదప జరిగినదంతా ఒక స్వప్నం మాత్రమే!

హఠాత్తుగా ఒక దేవదూత ప్రకాశవంతమైన కాంతితో ప్రత్యక్షమై సెంటారోను ఉద్దేశించి ఇలా అంది.

"నేను జోఫుకూ వద్దనుంచి వచ్చాను. చిరంజీవుల దేశం చూస్తే అవకాశం ఆయనే నీకు కలలో ఏర్పాటు చేశాడు. కాని నువ్వు అక్కడ జీవించడం దుర్భరమైంది. చనిపోవాలని వాంఛించావు. నీ దేశం చేర్చమని ప్రార్థించావు. నీ కోరిక లోని నిజాయితీని, పటుత్వాన్ని పరీక్షించేందుకు నిన్ను సముద్ర మధ్యంలో పడేసి ఒక పెద్ద సొరమీనును నిన్ను మ్రింగేందుకు పంపించాడు. నువ్వు భయవిహ్వలుడవై ఆర్తనాదం చేశావు. ఆ విధంగా నీ మరణ వాంఛ నిజం కాదని నువ్వేఋజువు చేసికున్నావు.

"చనిపోవడం కాని, చిరకాలం మనడం కాని మానవసాధ్య విషయాలు కావు, అని తెలిసికో. నువ్వు సాగించే జీవితమే ఉత్తమమైనదీ, వాంఛనీయమైనదీ. జనన మరణాలు జీవకోటి స్వభావం. కనుక అమర జీవివై చిరకాలం జీవించాలని కోరుకోవడంగాని, అనతికాలంలోనే మరణించాలని అనుకోవడంగాని, అందుకు ప్రయత్నించడంగాని వట్టి వ్యర్థ ప్రయాస. అటువంటివి కట్టిపెట్టు. నీ స్వగ్రామానికి తిరిగివెళ్ళు. నీ యింటిలో హాయిగా, సుఖంగా కష్టపడి పనిచేసి జీవించు. అదే ఉత్తమజీవనం" అని చెప్తూనే దేవదూత అంతర్థానమైపోయింది. సెంటారో తన పూర్వపు గృహాన్ని చేరుకొని శేష జీవితాన్ని ఆనందంగాను, సుఖంగాను, ప్రయోజనకరంగాను గడిపాడు. ★

---

# స్వీకారం

**జ్యోతి:**—మాసపత్రిక; సంపాదకుడు ధనికొండ హనుమంతరావు; వెల 0 8-0. ఈ కొత్తపత్రిక ప్రారంభ సంచిక (సెప్టెంబరు, 1955) మా కార్యాలయానికి చేరింది. ఈ సంచికలో కథలూ, గేయాలు, చిత్ర వార్తలూ, విచిత్ర వార్తలూ, నాటికలతో కూడిన 160 పేజీలున్నాయి.

**వెలుగు తార:**—"అభ్యుదయ సినిమా పక్షపత్రిక;" సంపాదకుడు జె. కృష్ణమరాజు. వెల 0 4 0; చిరునామా: 3/55, నవాబుపేట, నెల్లూరు 2. ఈ పత్రిక ఆగస్టు 15 న వెలువరించిన ప్రారంభ సంచిక మా కార్యాలయానికి చేరింది. ఇందులో సినిమాలకు సంబంధించిన వార్తలు, విశేషాలు ఉన్నాయి.

**అభ్యుదయ:**—అభ్యుదయ రచయితల ఐదవమహాసభా సంచిక, వెల 1-8-0; ప్రచురణ: అభ్యుదయ రచయితల సంఘం, విజయవాడ.

జూలై మాసాంతంలో విజయవాడలో జరిగిన అభ్యుదయ రచయితల సమావేశాన్ని పురస్కరించుకుని ఈ సంచిక ప్రకటించబడింది. 1943 లో స్థాపించబడిన అభ్యుదయ రచయితల సంఘం కొంతకాలంగా పనిచేయడం మానివేసి, ఇప్పుడు తిరిగి పని ప్రారంభించింది. అభ్యుదయ సాహిత్యవాదం చాల కాలంగా మనకి పరిచితమైనదైనా, దానికి బలమైన సంప్రదాయాలను, ప్రమాణాలను సృష్టించే సాహిత్యం రాదగినంతగా రాలేదు. అభ్యుదయ సాహిత్యం పేరిట అనేకంగా రచనలు వెలువడినా, సాహిత్య రీత్యా చూసినా నిలవలేని ఆ రచనలు అభ్యుదయ సాహిత్యంగా అసలు నిలవలేవు. సరియైన ప్రమాణాలు, విమర్శలు, మదింపు లేకపోవడంవలన వచ్చిన చిక్కు ఇది. ఈ చిక్కును ఈ సంఘం సరిచెయ్యగలిగితే మంచిదే

ఈ సంచికలో ఉప్పల లక్ష్మణరావు, శ్రీశ్రీ, కొడవటిగంటి, రమణారెడ్డి, సోమసుందర్, గిడుగు సీతాపతి, నార్ల చిరంజీవి మున్నగువారి ఉపన్యాస వ్యాసాలు, ఆనిసెట్టి, రాజమన్నారుగార్ల నాటికలు, కొన్ని గేయాలు, సభకు ప్రముఖులు పంపిన సందేశాలు ఉన్నాయి.

**పిచ్చిలోకం:** నాటిక; రచయిత 'శార్వరి'; వెల 0 8 0; ప్రచురణ: బాబాజీ పబ్లిషర్స్, తెనాలి. ★



వి. శాంతారాం నిర్మించిన టెక్నికలర్ నృత్య, సంగీతచిత్రం "ఝనక్ ఝనక్ పాయల్ బాజే"లో నాయక నాయికా పాత్రలు ధరించిన గోపీకిషన్, సంధ్యా.



జెమినివారి "ఇన్సానియత్" హిందీచిత్రంలో బద్రీప్రసాద్, దిలీప్‌కుమార్, బీనారాయ్, కుమార్, దేవ్ ఆనంద్.

భారత్ భూషణ్ ప్రస్తుతం రెండు పెద్ద చిత్రాలలో నటిస్తున్నారు. విశ్వభారతి వారు నిర్మిస్తున్న "బసంత్ బహార్" వాటిలో ఒకటి. టిప్పుసుల్తాన్ కాలం నాటి గాయకుని జీవితకథ ఈ చిత్రానికి ఆధారం. ఆ గాయకుని పాత్ర భారత్ భూషణ్ ధరిస్తున్నారు. ఈచిత్రంలో నిమ్మీకూడా నటిస్తున్నది. కథను విశ్రామ్ బేడేకర్ రచించారు. రాజా నవాతే దర్శకత్వం వహిస్తున్నారు.

భారత్ భూషణ్ నటించే మరో చిత్రం "ఆగ్రా". ప్రముఖ సంగీత దర్శకుడు ఆర్. సి. బోరల్ ఈ చిత్రం నిర్మాత. కథ పండిట్ ముఖ్రం శర్మ వ్రాశారు. ఈ చిత్రంలోకూడా భారత్ భూషణ్, నిమ్మీ కలిసి నటిస్తున్నారు.

*　　*　　*

కె. కె. ఘోష్‌ను వివాహమాడినున్న నటి నాదిరా కె. ఎల్. సంతోషి డైరెక్ట్ చేసిన "సర్మాగన్" చిత్రంలో తన పని పూర్తిచేసింది. ఈ చిత్రం నిర్మాత సర్దార్ చందూలాల్ షా.

*　　*　　*

ఈ వారం బొంబాయిలో జరిగిన ముఖ్య సంఘటన ఎస్. ఎమ్. ఎస్. నాయుడుగారి "ఆజాద్" చిత్రం రజతోత్సవం. ఈ ఉత్సవానికి గవర్నర్ హరేకృష్ణ మెహతాబ్ అధ్యక్షత వహించారు. ఆ సందర్భంలో నాయుడుగారిని బొంబాయి సినిమా పరిశ్రమలోని వివిధ సంస్థలు అభినందించాయి. ఈ ఏడాది రజతోత్సవం చేసుకున్న చిత్రాలలో ఈ చిత్రం మూడవది. మిగతావి ఫిల్మిస్థాన్ వారి నాగిన్, జాగృతి చిత్రాలు.

*　　*　　*

1351 సం॥ కె. కె. టి. అందాల పోటీ సందర్భంలో పైకివచ్చిన నటి షీన్ కన్వాల్ సినిమాల నుండి ఇక విరమించుకున్నట్లే. ఎక్కడా ఒక చిత్రంలో కూడా పనిలేక పోవడం మూలాన ఈమె ఇప్పుడు విందులు వేడుకలైన వాటికి మాత్రం హాజరవుతున్నది.

*　　*　　*

"కుబారా" చిత్రంలో నటించిన నటి జబీన్ కూడా ఖాళీగానే ఉంటున్నది. 'బాదా సలామత్' అనే చిత్రంలోను, మరొక చిత్రంలోను ఈమె తొలగించబడింది. దేవ్ ఆనంద్, కల్పనా నటించే "హమ్ సౌర్ తుమ్" చిత్రంలో చాలా చిన్న వేషం మాత్రమే ఈమెకు లభించింది.

*　　*　　*

"దునియా గోల్ హై" తో సినిమాలోకి వచ్చిన అనితా గుహా మరొక చిత్రంలో నాయిక వేషం వేస్తున్నది. ఆ చిత్రంలో దేవ్ ఆనంద్ నాయక పాత్ర ధరిస్తున్నారు. ఆ చిత్రానికింకా పేరుపెట్టలేదు. మహేష్




ఎ. వి. ఎమ్. వారి "వదినె" చిత్రంలో గుమ్మడి వెంకటేశ్వరరావు, ఏ. నాగేశ్వరరావు, సావిత్రి, తదితరులు.

## ★ బొంబాయి సినిమా లేఖ ★

కాల్ దర్శకత్వం వహిస్తారు. కథను హాస్య నటుడు ఓంప్రకాష్ రచించారు.

* * *

ఈ నెల 2వ తేదీన బొంబాయిలో "మెరైన్ డ్రైవ్" చిత్రం విడుదలఅయినది. నిర్మాత, దర్శకుడు జి. పి. సిప్పీ. ఇందులో బీనారాయ్, అజిత్, కె. ఎన్. సింగ్, విజయలక్ష్మి, జానీవాకర్, ఉమాదేవి నటించారు. ఇది నేరస్థులకు సంబంధించిన కథ. 'వయోజనులకు మాత్రమే' అని సెన్సార్లు సర్టిఫికెట్ ఇచ్చారు. కథ, దర్శకత్వం, నటన, సంగీతం ఏదీ బాగాలేదు. ఈ మాదిరి చిత్రాల్లో ఉండవలసిన 'సస్పెన్స్' ఏ కోశానా లేదు. జరగబోయేది ముందుగానే తెలిసిపోతుంది. బీనారాయ్ అసహ్యంగా ఉండడమే కాక, నటన బొత్తిగా చేతకానట్లు ఋజువుచేసుకున్నది. అజిత్ నటన భరవాలేదు. కాని అతని పాత్ర ఏమిటో నిర్మాతకే తెలియాలి. నృత్యాలు, సంగీతం అధ్వాన్నంగా ఉన్నాయి.

* * *

తూర్పు ఆసియా దేశాలలో పర్యటనకు బయలుదేరే సందర్భంలో ఎస్. కె. పాటిల్ గారికి బొంబాయిలోని వివిధ చలనచిత్ర వ్యాపారసంస్థలు సన్మానంచేశాయి. సన్మానానికి సమాధానం చెబుతూ, చిత్రనిర్మాతలలో ఐకమత్యం ఉండాలనీ, ఐకమత్యం సాధించడానికి తాను శక్తివంచనలేక ప్రయత్నిస్తాననీ, నిర్మాతలందరూ ఒకే సంఘంలోకి రావాలనీ ఉద్బోధించారు.

* * *

ఇటీవల బొంబాయిలో "కాంచి హవేలీ" "మునీంజీ" చిత్రాలు విడుదల అయినవి. మొదటి చిత్రం అర్థరహితమైన నిర్మాణం. నిరూపరాయ్, కరణ్‌దివాన్, భగవాన్ నటించారు. అభూతకల్పనలు, అసందర్భ సన్నివేశాలతో నిండిన ఈ చిత్రం కథ ప్రేక్షకులను ఆకర్షించలేదు. సంగీతంకూడా చప్పగా ఉన్నది.

దేవ్ ఆనంద్, నళినీజయవంత్, నిరూపరాయ్, ప్రాణ్ నటించిన ఫిల్మిస్తాన్‌వారి "మునీంజీ" మంచి చిత్రం. 'బాక్సాఫీస్ హిట్' కాగల లక్షణాలు ఉన్న చిత్రం. దర్శకుడు సుబోధ్ ముఖర్జీ; కథ రచించినది నటుడు రంజన్. పితృభక్తి, మాతృప్రేమ, మంచి సస్పెన్స్, సాహసాలు, ప్రణయం వగైరా ప్రేక్షక జనాకర్షకమైన అంశాలు ఈ చిత్రంలో ఉన్నాయి. పాటలు, నృత్యాలు బాగున్నాయి. సంభాషణలు హాస్యపూరితమై ఉన్నాయి. అన్నిటికంటే దేవ్ ఆనంద్ ద్విపాత్రాభినయం ప్రేక్షకులను బాగా మెప్పిస్తుంది. దేవ్ ఆనంద్ ఇదివరకు ఏ చిత్రంలోనూ నటించనంత బాగా ఈ చిత్రంలో నటించాడు.

నేషనల్ ఆర్టు థియేటరువారి "జయసింహ"లో జయసింహుడుగా రామారావు, విజయసింహుడుగా కాంతారావు.

# అపరాధ పరిశోధక చిత్రం "సర్దార్"

జ్ఞాన్ ముఖర్జీ నిర్మించి, డైరెక్ట్ చేసిన "సర్దార్" హిందీ చిత్రాన్ని ఏ. వి. ఎమ్. లిమిటెడ్ వారు మద్రాస్, వెలింగ్టన్‌లో ఈ నెల 2 వ తేదీన విడుదల చేశారు. దొంగల సర్దార్ ఒకణ్ణి పట్టుకోడానికి పోలీసు అధికారులు చేసిన ప్రయత్నాలు, వారినుండి తప్పించుకోడానికి సర్దార్ చేసిన ప్రయత్నాలు, చివరికి సర్దార్ పట్టుబడడం, అతడు పెంచిన బాలిక పోలీసు అధికారి రంజిత్‌ను ఆఖరున పెండ్లిచేసుకోవడం వగైరా ఇతివృత్తంతో నడిచే అపరాధ పరిశోధక చిత్రం ఇది. దొంగల సర్దార్‌గా అనుభవజ్ఞుడైన నటుడు జగదీప్ సేఠి చాలా బాగా నటించాడు. అతన్ని పట్టుకోడానికి బయలుదేరిన పోలీసు అధికారి రంజిత్‌గా అశోక్‌కుమార్ కూడా బాగా నటించాడు. రంజిత్‌ను ప్రేమించిన బాలిక చంప పాత్రను బీనారాయ్, సర్దార్ ఉంపుడుకత్తెయైనా పాత్రను నిగార్ ధరించారు. సంగీత దర్శకుడు జగన్‌మోహన్. హేమంత కుమార్, లతా, ఆశాభోన్‌స్లే ప్లేబాక్ పాటలు పాడారు. "చల్‌రీ చలీ చల్ సైయా" అని హేమంత్‌కుమార్ పాడిన పాట అన్నిటిలోకీ బాగుంది.

స్క్రిప్టు రచన, దర్శకత్వం నిపుణంగా ఉన్నాయి. అందుచేత ఈ బాపతు చిత్రాలకు అవసరమైన 'సస్పెన్స్' బాగా పోషింపబడింది. ప్రతిసారీ ముందేమవుతుందా అని ప్రేక్షకులకు ఉత్కంఠ కలిగించడంలో దర్శకుడు కృతకృత్యుడైనాడు.

ఆఖరులో 'దొంగామనిషే' ననే అభిప్రాయం కలిగించడానికి ప్రయత్నించడం అసహజంగా, అసహ్యంగా ఉన్నది. నేరస్థునిమీద సానుభూతి కలిగించాలంటే, అసలు పాత్రపోషణయే భిన్నంగా ఉండాలి ఎంతో ఉదాత్తమైన ఆశయాలు, స్వభావం గల మనిషి నేరం చేసినప్పుడు మాత్రమే వానిమీద సానుభూతి కలిగించడానికి వీలుంటుంది. దుష్టస్వభావంగల నేరస్థుడిమీద సానుభూతి కలగదు. హాలీవుడ్ 'క్రైమ్' చిత్రాల పద్ధతిని అనుకరించాలని ఇటీవల హిందీ నిర్మాతలు చేస్తున్న ప్రయత్నాలు చాలా అనారోగ్యకరమైనవి.



# భారతీయ చిత్రాలకు విదేశాలలో మార్కెట్

భారతీయ చిత్రాలకు విదేశాలలో తగినంత మార్కెట్ ఎందుకు లభించడం లేదో కారణాలు ఆలోచించి, మార్కెట్ సంపాదించటానికి కృషిచేయవలసిందని వి. కె. కృష్ణమీనన్‌గారు ఇటీవల మద్రాసులో, దక్షిణ భారత ఫిల్మ్ ఛేంబరు సభ్యులకు... సిసి టెక్నీషియన్ల సంఘం చేసిన సన్మానానికి సమాధానమిస్తూ చెప్పారు.

చలనచిత్రాలు కేవలం వినోదంకోసమే కాదనీ, చలనచిత్రం ఒక ప్రత్యేక కళ అని కృష్ణమీనన్‌గారు ఉద్ఘాటించారు. భారతీయ చిత్రాలు విదేశాలలో ప్రదర్శింపబడక పోవడానికి చాలా కారణాలున్నాయనీ, అత్యధిక చిత్రాలు నిర్మించే అమెరికాలో కూడా, సినిమాస్కోప్ మొదలైన కొత్త టెక్నిక్‌లు వచ్చి ఆర్థికపరిస్థితిని తారుమారు చేస్తూండడంచేత చలనచిత్ర నిర్మాణం కష్టమైపోతున్నదనీ, మరొక అయిదారేళ్లలో కొత్త టెక్నిక్‌ల మూలంగా మామూలు చిత్రాలకు స్థానమే ఉండదని ఆయన తెలిపారు.

"భారతీయ చిత్రాలలో ఎక్కువభాగం పౌరాణికాలో, లేక "సాంఘికా" లనబడేవో కావడంచేత వీటికి విదేశాలలో సముచితస్థానం లభించడంలేదు. "సాంఘిక" చిత్రాలనబడే వాటికి స్థానికంగా మాత్రమే ఆదరణ ఉంటుంది తప్ప విదేశాలలో వాటిని అర్థం చేసుకోవడం కష్టం. ఆ దేశాలలో పరదేశచిత్రాలపై నిర్బంధాలుకూడా అనేకం ఉన్నాయి. భాష తెలియకపోవడం, మన చిత్రాల పొడుగు ఎక్కువగా ఉండడంకూడా కారణాలే. భారతీయ చిత్రాల్లో పాటలులేని చిత్రాలులేవు. పాశ్చాత్య చిత్రాలలో సంగీతానికి చాలా తక్కువ స్థానంమాత్రమే ఉంది. చిత్రపరిశ్రమలో ఆసక్తి గలవారందరూ ఈవిషయాలు ఆలోచించి, విదేశాలలో మార్కెట్ సంపాదించాలంటే తమ పద్ధతులను మార్చుకోవలసి ఉంటుంది.

మన చిత్రపరిశ్రమ వయస్సు 30 ఏళ్లు మాత్రమే. ఇతరదేశాల మార్కెట్‌లో చొరబడడానికి ఇది చాలదు. పాశ్చాత్య దేశాలు అంతకుపూర్వంనుంచీ కృషిచేస్తున్నాయి కనుక ఆ దేశాల చిత్రాలు ప్రపంచపు నలుమూలలకూ చొచ్చుకుపోగలిగాయి. తీవ్రకృషి చేస్తే మనంకూడా కృతకృత్యులం కాగలము," అని కృష్ణమీనన్ అన్నారు.

"మనదేశపు పరిస్థితులకు పూర్తిగా భిన్న పరిస్థితులుగల దేశాల్లో మన చిత్రాలకు ఆదరణ కష్టమవుతుంది. దక్షిణ అమెరికా దేశాల్లోను దూరప్రాచ్య దేశాల్లోను కొంత మార్కెట్ దొరకవచ్చును," అని ఆయన చెప్పారు.

విదేశాలలో మార్కెట్ సంపాదించడంలో ప్రభుత్వ సహాయం అపేక్షించవద్దనీ, కాకపోతే ఎగుమతి నిర్బంధాలను ప్రభుత్వం సడలించవచ్చుననీ, పరిశ్రమలోని వారే పరస్పరం సహకరించి విదేశాలకు తమ చిత్రాలను ఎగుమతిచేసే విషయమై కృషిచేయాలనీ ఆయన ఉద్బోధించారు.





త్వరలో విడుదలకానున్న రాజ్‌కపూర్ చిత్రం "శ్రీ 420"లో నాట్యంచేస్తున్న నాదిరా.

# అపరాధ పరిశోధక చిత్రాలపై నిషేధం

నేరం, హింస, భయోద్రేకం, దొంగతనం, తుపాకీ యుద్ధాలూ మున్నగువానిని, బాల నేరస్తులను తీసుకొని ఇతివృత్తాలు అల్లిన విదేశీ చిత్రాలను నిషేధించడానికి భారత ప్రభుత్వం నిశ్చయించింది. దేశంలో ప్రదర్శింపబడుతున్న విదేశీ చిత్రాలను విస్తృతంగా పరిశీలించినమీదట, ప్రజాభిప్రాయాన్ని గమనించినమీదట, అటువంటి చిత్రాలు చిన్నవారిపై కనబరచే ప్రభావాన్ని చూచినమీదట ప్రభుత్వం ఈ నిర్ణయానికి వచ్చిందట.

చలనచిత్రాలు వినోద ప్రధానములైనప్పటికీ, నేరం, హింస చూపించే చిత్రాలు ఆరోగ్యవంతమైన వినోద సాధనాలు కావని ప్రభుత్వం అభిప్రాయపడుతున్నదట. అటువంటి చిత్రాలపై బ్రిటన్‌లో అమలు జరపబడుతున్న నిర్బంధాలు, అమెరికాలో కూడా వాటిపై ప్రబలుతున్న నిరాదరణ ప్రభుత్వ నిర్ణయానికి దోహదమైనాయట.

## జెక్ చిత్రాలు

భారతీయ చిత్రాలను ఇచ్చి జెక్ చిత్రాలను తీసుకునే పద్ధతిమీద ఇటీవల భారతదేశం వచ్చిన జెకొస్లొవాక్ ఫిలిం ప్రతినిధి వర్గానికి, బొంబాయిలోని ఇండో యూరోపియన్ ఫిల్మ్స్ ఎక్స్ఛేంజివారికీ ఒప్పందం జరిగిందట. ఆవారా, దో బిఘా జమీన్, పాంపోష్, రాహీ చిత్రాలను ఇచ్చి కొన్ని జెకొస్లొవాక్ చిత్రాలను తీసుకోడానికి ఒప్పందం జరిగిందట.

## మిస్ మేరీ సీటన్

భారతదేశంలో చలనచిత్రాలపై ఉపన్యాసాలిచ్చేందుకు భారత ప్రభుత్వంచే ఆహ్వానింపబడిన మిస్ మేరీ సీటన్ ఈనెలాఖరులో భారతదేశం రానున్నది. ఈమె ప్రముఖ రష్యన్ దర్శకుడు శ్రీ శ్రీ ఐజెన్‌స్టీన్ స్నేహితురాలు; ఆయన జీవితకథా రచయిత్రి. ఐజెన్‌స్టీన్ మెక్సికోలో తీసిన "థండర్ ఓవర్ మెక్సికో" చిత్రంతాలూకు కొన్ని భాగాలను ఈమె "టైమ్ ఇన్ ది సన్" అనే చిత్రంగా నిర్మించి విడుదలచేసినది. రష్యన్ చిత్రనిర్మాణ పద్ధతులలో ఈమె ప్రత్యేక కృషిచేసినది.

# సినిమా వార్తలు

తెలుగులో అపార విజయం ఆర్జించిన "రోజులు మారాయి" చిత్రాన్ని సారథీ వారు తమిళంలో పునర్నిర్మించనున్నారు. తెలుగు చిత్రానికి పనిచేసిన టెక్నీషియనులే తమిళ చిత్రానికి కూడా పనిచేస్తారనీ, తారాగణంలో మాత్రం మార్పు ఉంటుందనీ తెలుస్తున్నది. పాటల రికార్డింగ్ త్వరలో మొదలుపెడతారనీ, సంభాషణల రచన పూర్తి అయిందనీ కూడా తెలుస్తున్నది.

* * *

వి. శాంతారాం నిర్మించిన టెక్నికలర్ చిత్రం "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" ఈనెల విడుదల అవుతుందని తెలుస్తున్నది. ఈ చిత్రం తాలూకు కాపీలు లండన్‌లో ప్రింట్ చేయించారు. అంతర్జాతీయ ప్రదర్శనకు ఇంగ్లీషు సబ్‌టైటిల్స్ కూడా తయారు చేయిస్తున్నారట. ఈ చిత్రం మద్రాసులో ఇంగ్లీషు చిత్రాలు మాత్రమే ప్రదర్శించే మిడ్‌లాండ్‌లో ప్రదర్శింపబడుతుందని ప్రకటించబడింది. నృత్యకళకు సంబంధించిన ఇతివృత్తంతో తయారైన ఈ చిత్రంలో చక్కని నృత్యాలు, సంగీతం ఉన్నాయట. నాయక నాయికా పాత్రలను నృత్య దర్శకుడు గోపీకిషన్, సంధ్య ధరించారు.



నర్తకి మిస్ వహీదా.



హిందీనటి చాంద్ ఉస్మానీ.

Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor: S. Sambhu Prasad.



రాధామాధవలాస్యం —అమలాపురపు భాస్కరరావు, శ్రీకాకుళం.